# నీతివాచకము

## ఆఱవ పుస్తకము

గ్రంథకర్తలు:
మహావాది వేంకటరత్నము,
మిన్నికంటి గురునాథశర్మ.



*Publishers:*
**Sundara Ram & Sons, Tenali.**

**1932**

 [0-6-0

ఓమ్

# నీతివాచకము.

## ఆఱవ పుస్తకము

గ్రంథకర్తలు :

మహావాది వేంకటరత్నము, బి. ఏ.,

ఆంధ్రోపన్యాసకుఁడు - ఆంధ్రక్రైస్తవకళాశాల, గుంటూరు

ఉభయభాషాప్రవీణ

మిన్నికంటి గురునాథశర్మ,

తెలుఁగు పండితుఁడు - కొర్ హైస్కూలు, గుంటూరు

*Publishers :*

**Sundara Ram & Sons, Tenali.**

**1932**



[ వెల **0-6-0**

# విషయ సూచిక

## సప్తమాధ్యాయము - పరిత్యాజ్యములు.



## అష్టమాధ్యాయము - వికారములు.



## ఉపసంహారము.

# ఉపాధ్యాయులకు మనవి.

ఉపాధ్యాయసోదరులారా !

1. ప్రస్తుతము ప్రాథమికవిద్యాప్రపంచములోఁగల నానావిధవాచకముల మార్గము వేఱు. ఈనీతివాచకముల మార్గము వేఱు. పేరును బట్టియే వీనిప్రాశస్త్యము విశదము. ఇవి కేవలము నీతివిషయములనే బోధించును గాని యన్యవిషయములమాట తలపెట్టవు.

2. ఇప్పు డున్న వాచకములలో నీతిపాఠములు తక్కువ. ఉన్న కొన్నియైనను కథామూలకములే కాని విషయవిచారణబాహుళ్యము గలవి కావు. " సత్యము చెప్పవలెను " అనువిషయమును బోధించునప్పు డిప్పటి వాచకములు "సత్య మన నేమి ? దానియొక్క గొప్పతన మెట్టిది ? అది యెట్లు సర్వోత్తమమైనది ? " అను విషయములఁగూర్చి విపులముగాఁ గాకున్నను గొద్దిగానైన బోధింపక యందు కుదాహరణముగా నేదో యొక కథను జెప్పుచున్నవి. ఇందువలన బాలురకు విషయమును గూర్చి చక్కఁగాఁ దెలిసికొను నవకాశము లభించుట లేదు.

3. ఇట్టి కొఱఁతను ఈనీతివాచకములు పోఁగొట్టుచున్నవి. ఇందు ప్రతి విషయము చక్కఁగాఁ దెలుపఁబడి చివర విషయనిరూపణమునకుఁగాను కథలు చేర్పఁబడినవి. ప్రాథమికవిద్యాప్రపంచములో నిది క్రొత్త యగుటచేత ఈ నీతి వాచకములు పనికివచ్చునా ? యను సంశయము గలుగవచ్చు. కాని " విద్య " యను పదముయొక్క నిజమైనయర్థము నెఱింగువా రేమాత్రము సందేహింపరని మావిశ్వాసము.

4. "ఆవు పాలిచ్చును - ఆవుపాలు తెల్లగా నుండును. గుఱ్ఱము బండి లాగును " అను విషయములే బోధనీయములో, తననిత్యప్రవర్తనమును శీలమును సరిచేసికొనుట కనువగు నుత్తమపద్ధతులం గూర్చి బోధించు విషయములే బోధనీయములో యుపాధ్యాయులే యూహించుకొనవచ్చు. పైవిషయములు తనకుఁదాన పెద్దవాఁడైనంతనే బాలుఁడు తెలిసికొనఁ గలఁడు. కాని యుత్తమ పద్ధతులం గూర్చినబోధ యతనికి ముఖ్యావశ్యకము.

5. విద్య నేర్చుట జ్ఞానముకొఱకు. లౌకికజ్ఞానమునకు సామాన్యవస్తుగుణ గ్రహణమునకు స్వానుభవము చాలు. ఉత్తమజ్ఞానమున కనుభవము

చాలదు. గురుశిక్ష యుండవలె. కావున బాలురకు, బాలికలకు, బోధింప
వలసినది నీతివిద్య. నీతియే శీలమునకు నిలయము. శీలమే మానవుని
గొప్పతనమునకు మూలము.

6. ఈ యభిప్రాయమును బలపఱచి వ్యాపింపఁజేయుటకే యీవాచకములు
వ్రాయఁబడినవి. ప్రహ్లాదుఁడు విద్య నేర్చునప్పుడు తోడిబాలురకు
బోధించినవిషయములు స్మృతియందున్నచో నీవాచకముల గొప్ప
తనము విశదము గాఁగలదు.

7. ఈ పుస్తకములు విద్యార్థులతరగతులకుఁ దగినట్లు రచింపఁబడినవి.
అయినను జీవితమునడపుపద్ధతిని బెక్కుతెఱంగులఁ జర్చించి సూచించు
టచేఁ బెద్దలకుఁ బిన్నలకు నెల్లర కియ్యవి పఠనీయములనుట కెట్టి సంది
యము లేదు. జీవితపరమావధి యొక్కండేయగుట ధర్మములు పర
స్పరసంబద్ధములగుటఁ దత్సూచకపద్ధతులలోఁ బునరుక్తి యొచ్చటనే
నుండకతప్పదు. మఱియు నయ్యది కొన్నియెడల విషయము నొక్కి
చెప్పుటకును నుపయోగింపఁబడియుండును. విధినిషేధవాక్యములు
నట్లే వ్రాయఁబడినవి. బాలావబోధార్థ మిట్లు చేయవలసివచ్చెను.
అందందు విస్తరించి వ్రాయఁబడఁదగిన బహుభావార్థములు సంక్షేపించి
సూత్రప్రాయముగాను వ్రాసియుంటిమి. అందఱకు నుపయోగించుటకు
నుద్దేశించుటచే నందందు శ్లోకము లుదాహరింపఁబడినవి. బాలు రయ్యవి
వదలినను వదలవచ్చును.

8. ఈ వాచకములలో బొమ్మలు చేర్పఁబడలేదు. ఇందుకుఁగారణము జంతు
వృక్షాదికవిషయంబులు లేకుండుటయే. కథలు విషయనిరూపణమునకుఁ
గాను జేర్పఁబడినవి గనుక నందును జిత్రములయావశ్యకము కన్పట్టదు.
ఇవి మొత్తముమీఁద నూతనమార్గవిరచితంబులు గనుక మే మూహిం
చిన ప్రాశస్త్యము వీనియందు గమనించి యుపాధ్యాయులు విద్యార్థి
కారులు సదభిప్రాయులై ప్రోత్సహింతురుగాక యని మనవి.

గుంటూరు,
30-12-1932.

మ. వేంకటరత్నము,
మి. గురునాధశర్మ.

# నీతివాచకము

## సప్తమాధ్యాయము - పరిత్యాజ్యములు.

### ౧. ఆత్మస్తుతి

శ్రీకరుఁడా ! శ్రీమద్గుణాకరా ! ఆత్మస్తుతి మిక్కిలి నింద్యమైన కార్యము. అది మహాపాపకరమేగాక యపకీర్తికరము నగును.

ఆత్మస్తుతియనఁ దనను బొగడుకొనుట. తననామమునే తాను జెప్పికొనఁగూడ దనుచుండఁ దాను జేసిన ఘనకార్యములను జెప్పికొనుచుఁ దన్నుఁ బొగడుకొనవచ్చునా ?

శ్లో. ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ
ఆయుష్కామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్యకళత్రయోః

తననామమును గురువర్యునామమును పాపాత్ముని నామమును, పెద్దకుమారుని నామమును, భార్యనామమును, జిరకాలము బ్రదుకఁదలంచినచోఁ జెప్పఁగూడదు. "దినమేకం హరత్యాయుః" ఆయు వొక్కదినము తఱుఁగునని పెద్దలందురు.

సుశీలురు తమ్మొరులు ప్రశంసించుచున్న వినరు. విన నిచ్చగింపరు. "తన్నుఁ దాఁ బొగడుకొనుట తన్నుకొనిచచ్చుట" యనుసామెతను వినలేదా ? ఆత్మస్తుతిపరాయణు లసమర్థులని

గట్టిగా నమ్ముము. సమర్థుఁ డెన్నఁడు తనచేఁతలఁ జెప్పికొ
నఁడు. సమర్థులయశస్సు తమకు లేమి నసమర్థు లది వొందుటక
ట్లాత్మస్తుతి చేసికొందురు. వా రొరుల యింగితాకారములను
గుర్తింపలేరు. తమచెప్పుచేఁతల శ్రోతలు విశ్వసించుచుండి
రనియే వారితలంపు. తమమాటల కొరులు సంతసించి నవ్వ
కున్నఁ దామె పెద్దపెట్టున నెలవివాఱ నవ్వి వారల నవ్వింపఁ
దంటాలు పడుదురు.

పిల్లి కనులు మూసికొని పాలుద్రావుచుఁ దన్నొరులు చూచు
చుండలేదని తలంచునట్లు మూఢుఁ డాత్మప్రశంస చేసికొనుచు
నాయవగుణము నొరులు గ్రహించుచుండలేదని తలంచును.
ఆత్మస్తుతి యనుచితకార్యమని యొరులకుం జెప్పుచుఁ దా నా
పని చేయుచుండును. అయ్యో! పాపము! వీఁడు తనదోషముఁ
దా నెఱుంగఁడుగదా!

ఈయాత్మస్తవనశీలునకు బుద్ధిమాంద్య ముండును. ఏలయనఁ
దనచరిత్రము మర్మజ్ఞుల యెదుటఁగూడ నేవేవియో చెప్పి
కొనుచుండును. వినువారికిఁ జెవులు లేవని తలంచునో యేమో!
నిజమునకు వీఁడు కన్నులుండినను గ్రుడ్డివాఁడే. చెవులుండినను
చెవిటివాఁడే. ఏలనందువా? తన్ను శ్రోతలు భ్రూచలనశిరః
కంపనాదులచేఁ దిరస్కరించుచున్నను జూడఁడు. శ్లేషాదు
లచేఁ బరిహసించుచున్నను వినఁడు.

ఆత్మస్తుతిశీలుఁడు మసిపూసి మారేడుకాయనుజేసి గౌరవము పొందఁజూచును గాని నిజము నిల్కడమీఁదఁ దెలిసినపిదపఁ గల్గెడి పరాభవమును గణింపఁడు.

ఆత్మస్తుతి యొక్కవిధముగా నుండదు. కొందఱు తా మొనర్చిన కార్యములఁ జెప్పికొందురు. కొందఱు తమకార్యములఁ బెద్దవి చేసి గొప్పగాఁ జెప్పికొందురు. కొందఱు లేనివియుఁ జేయనివియు నున్నట్లు చేసినట్లు చెప్పికొందురు. కొంద ఱవృష్టులయ్యు నెఱుఁగనితావులఁ జెప్పికొందురు. కొంద ఱెఱిఁగిన నెలవులనైన నెఱుఁగనిసలములనైన నదృష్టులై చెప్పికొనుచుందురు. ఈచెప్పికొనుట ప్రతిఫలాపేక్ష కల్గియేయని యెఱుఁగునది. ఆకోరికి ధనరూపముననైన యశోరూపముననైన నుండును. సాధారణముగాఁ గుక్షింభరుల కీదురభ్యాస ముండును. అదిచూచి 'వీరు గొప్పవారు కాఁబోలును. వీరిని గౌరవించి కొలువలయు" నని శ్రోత లెంతురని తమయభిప్రాయము. బాలుఁడా ! ఈతెన్నున నడవకుము. ఈమార్గము నిశితకంటకావృతము. ఇందుఁ బరాభవదవాగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుచుండును.

ఒకవేళ నీవు గొప్పవాఁడవే యనుకొనుము. గొప్పకార్యములనే చేసితి వనుకొనుము. వానిని నలువురు నినుఁ బొగడుటకై

యొనర్చితివా? ప్రతిఫలాపేక్షతోఁ జేసితివా? అట్లైన నది యకార్యమే. వృధా వ్యయహేతువే.

ఆపణికుఁడు తనవస్తువుల నావి మంచివస్తువు లనిచెప్పికొనిన నేమైన లాభ మొందునేమో కాని నీవు నాశరీరము సుందర మైనదని పొగడుకొనిన నేమిలాభ మొందెదవు?

మా వీధిలో నొకసంపన్నగృహస్థుఁ డుండెడివాఁడు. ఆయన మెవరు త్రోవను బోవుచున్నను బిల్చి 'నే నీగొప్పపని చేసితిని. అమితధనము సంపాదించితిని. నన్నుఁజూచి యందఱు భయ పడెదరు. పెద్దపెద్ద జమీందారులు నాసలహాతీసికొని ప్రవ ర్తింతురు. నాకొడుకులు నట్టివారే. వారు సంస్కృతమందు నాంధ్రమందు నాంగ్లమందు సంగీతమునందుఁ బ్రవీణులు' అని యిట్లు గంటలకొలఁది తనకుటుంబప్రశంసయే చేయుచుం డును. ఇది యొకవ్యాధి కాదా?

బాలుఁడా! ఆత్మప్రశంసయనఁ దన్నుఁ బొగడుకొనుటయే కాదు. ఆత్మీయప్రశంసయు ననియెఱుంగుము. పుత్రకళత్రా దులఁ బొగడుటయుఁ బ్రశస్తముకాదు. మఱియు వారి కాప్ర శంస యనర్థకారియు శ్రేయోవిరోధియు నగును.

కిరాతార్జునీయమను సత్కావ్యమును రచించినభారవి మహా విద్వాంసుఁడు. ఆయన వందలకొలఁదిపండితులను శాస్త్రార్థ మున జయించినవాఁడు. అందువలన నతఁడు నాకంటె గొప్ప

పండితుఁ డెవ్వఁడు లేఁడని పల్కుచుండెడివాఁడు. తండ్రి యగు శ్రీధరపండితున కిది తెలిసి 'నీకంటె గొప్పవా రనేకులు గలరు. నీవు వారిముందు నోరెత్తఁగలవా ?' అని యొంటరిగాఁ బెక్కుసారులు మందలించుటయేగాక యితరపండితుల సమ్ముఖంబునఁ గూడ భారవిని 'నీవు వట్టిమూర్ఖుఁడవు. ఇంకను జదువుకొనవలయు' ననుచుఁ దిరస్కరింపసాగెను. తండ్రి సేయుచున్న యీపరాభవము గొడుకు సహింపలేకపోయెను. ఒకనాఁడు రహస్యముగాఁ దనతండ్రిని జంపివేయుటకై యాతనిగదిలో డాగియుండెను. అప్పుడు సుశీలయను సార్థకనామముగల భారవిమాత శ్రీధరునితో నిట్లనియె.

"పిల్లవాఁ డీదినమున నన్నము దినలేదు. ఉదయమునుండియు దీనాననుఁడై యున్నాఁడు. చూచితిరా? ఎందుకు మీ రెప్పుడు వానిని నిందించుట ? వాఁడు పండితుఁడే కాని, మూర్ఖుఁడు కాఁడుగదా?" అన భర్తయగు శ్రీధరుఁ డిట్లనియె. "అవును. వాడు పండితుఁడే కాదు; మహాపండితుఁడును నగును. ఇది నాకుఁ దెలియకపోలేదు. వానిని జూచి నేను మదిలో సంతసింపక పోవుట లేదు. ఐనచో నెందుకు నిందించెద వనియెదవా ? వినుము. వాఁడు నామాటలవలన నింకను జదువుకొని యింతకంటె గొప్పపండితుఁ డగుటకుఁ బ్రయత్నించును. వాని పేరు దిగంతములవఱకు వ్యాపించును. వాఁ డందఱికంటె మిన్నయగును. ఇప్పు డున్నచదువుతోడనే వాఁడు

గర్వించి సర్వముం దెలిసితి ననుచున్నాఁడు. వాఁడు చదువని గ్రంథములు పెక్కులుగలవు. కనుక నా గర్వము మాని వాఁ డభ్యుదయ మందుట కట్లుపల్కుచుంటిని గాని వానిని దూషించుటకుఁ గాదు. వానియందుఁ బ్రేమము నాకు లేకకాదు. ఇతోధికాభివృద్ధిని నాప్రియపుత్రుఁ డందవలయు ననియే నాకోరిక. అందులకే వాని నింకను జదువుకొను మనియు నీవింకను బండితుఁడవు కాలేదనియు ననుచుంటిని" అనియె. ఆగదిలోనే రహస్యముగా డాగియుండి తల్లితండ్రుల సంభాషణమును వినుచున్న భారవి దుఃఖాతిశయముచే మూర్ఛపోయెను. తెల్లవారినపిదప లేచి భారవి తండ్రియొద్దకేగి తన యపరాధముం జెప్పికొని సుశిక్షితుఁడై గతాహంకారుఁడై మహాపండితుఁడై క్రమముగా సుప్రసిద్ధుఁడయ్యెను. కనుక నాత్మస్తుతి గర్వము పనికిరాదు.

ఎప్పు డాత్మస్తుతియుండునో యప్పుడు వెంటనే పరనింద వేచియుండును. పరనిందచేయక యాత్మస్తుతి చేసికొనుట కవకాశ మెక్కడిది ? నిందాశీలురు పరులసుగుణముల నవగుణములుగా మార్చివేయుదురు. ఒకవేళ వారికి స్వల్పావగుణములున్నచో వానిని గొండంతలుచేసి వర్ణింతురు. పరులసత్కార్యములఁ దా మొనర్చితిమని పై వేసికొందురు. బదులుతీర్చుటకో యన్నట్లు తమ యకార్యముల వారిపై వేయుదురు.

ఆత్మప్రశంస యన్యనిందాగర్భితమై యుండితీరును. అన్యులఁ బ్రశంసించువాఁ డాత్మప్రశంస చేసికొనలేఁడు. పాయసముఁదిని బ్రదుకనేర్చినవాఁడు పాలనురుగుఁదిని బ్రదుకఁగలఁడా ?

పైఁడిపా డగ్రహారములోని రామరాయకవీంద్రునికిఁ బెక్కురు శిష్యులుండిరి. అం దొకశిష్యునిదగ్గఱ కొకపండితుఁడు వచ్చి ' మీగురు వేమియుఁ జదివికొన్న వాఁడు కాఁడు ? ఆయనకు షట్‌శాస్త్రములలోఁ బ్రావీణ్యము లేదు. ఆయన వట్టి మొద్దు. అట్టి యవివేకిని మీ రేమనియాశ్రయించితిరి? నా దగ్గఱకు రండు. నేను గొప్పపండితుఁడను. ఏవిద్య కావలయు నన్నను జెప్పెదను. మఱియు నేను గాలిలో నెగురఁగలను. నీళ్లలపై నడువఁగలను. నిప్పులోఁ బండుకొనఁగలను' అని చెప్ప నాశిష్యుఁ డయ్యా ! యిన్నివిద్యలు వారియొద్ద లేకున్నను వీనియన్నిటికంటె మించిన దొకటి వారియొద్దఁ గలదు- అను చుండ నాపండితుఁడు మండిపడి ఏమున్నది మీగురువునొద్ద ? నేలమట్టియా ? యన శిష్యుఁడు కాదుస్వామీ ! “ఆత్మస్తుతి-పరనింద” వీనినొనర్పని సచ్ఛీలముమాత్రము వారియొద్దఁ గలదు. దానిని నేర్చుకొనుటకై వారిశుశ్రూష చేయుచుంటి మన నాపండితుఁడు సిగ్గుపడి పోయెను. కావున నెంతపండితుఁ డైనను వీనిరెంటికిఁ దొలఁగి యుండవలయును.

క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా! యిది యెట్లు చెప్పు మనియడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము చె
ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుఁ.

అను పద్యము నాధారముచూపి కొందఱు తమవిషయముం జెప్పికొందురు. ఒకవేళ నాపద్యార్థమును దమ కన్వయించుకొనినను 'సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుఁ' అనియుఁ గలదని జ్ఞప్తియుంచుకొని చెప్పవలయును. తమవిషయమైనను నడిగినపుడు సత్యముచెప్పిన దోషమేమి? కవులు తమగ్రంథములలోఁ దమవిషయముఁ జెప్పికొందురు. అందసత్యముంట కవకాశము లేదు. ఆమాత్రమైనఁ జెప్పికొనుటవలననేకదా నేఁడు కవులచరిత్రల మన మెఱుఁగఁ గలిగితిమి. చరిత్రోపయోగి యగునది దోసం గెట్లగును? వారును స్వవిషయము వాక్రుచ్చుపద్ధతిలో నత్తెఱంగు లైరి. గుప్తాహంకారఫణితి గలవాఁ డుదాత్తుఁడు. పరాపవాదముతోఁ గూడిన స్వోత్కర్షవాది యుద్ధతుఁడు. యుక్తిచే నిజోత్కర్షముఁ జెప్పికొనువాఁడు ప్రౌఢుఁడు. స్వాపకర్షప్రకాశక మగువినయోక్తి గలవాఁడు వినీతుఁడు. వారి ప్రత్యక్షరము మనయభివృద్ధికి మార్గ మగుచున్నదిగదా. ప్రబంధకర్తలమార్గము పామరుల కేల? నాయనా! ఆత్మస్తుతి-పరనింద - ఈరెంటి కెడమై యుంటివా నీపుణ్యము క్షీణింపదు. మూకీభావసాహ్యమున దీని నభ్యసింపుము.

ఆత్మస్తుతివలనఁ దనపుణ్యములు క్షీణించిపోవును. పరనిందవలనఁ బరులపాపములు తన్నలముకొనును. ఎంతభగవద్భక్తుఁడైనను నీపాపమునుండి తొలఁగనిది ముక్తిలేదు.

కుమారస్వామి ప్రతిదినము వేగుజాముననే లేచి సర్వపుణ్యతీర్థములలోఁ గ్రుంకి యింటికివచ్చి పంచయరుగుపైఁ గూర్చుండిన వినాయకుని జూచి "పెందలకడ లేచి స్నానసంధ్యాదుల నొనరింపరాదా ? సుకృత మార్జింపరాదా ? ఇంతపెద్దవాఁడవైనను నీకింకను జ్ఞానము లేకపోయెను. ఇంతమూర్ఖుఁడవేమి ? నన్నుఁజూచియైన నేర్చుకొనుము" అనుచుఁ బోవుచుండెడి వాఁడు. ఒకదినమున నీమాటలఁ దండ్రి విని "కుమారా ! నీవు వేగుజామున లేచి తీర్థసేవసల్పి పరదూషణము సేయుకంటె నీవును వానివలె నున్న మేలుగదా ? తీర్థసేవ చేయకుండుటకంటె పరదూషణమే మహాపాపముసుమా ! అదియునుగాక వానికి సుకృతము లేదంటివి. నీవు నిత్యము వానిని దూషించుటవలన నీవు సంపాదించుచున్న సుకృతమంతయు వానికిఁ జేరుచున్నది. నీవే పాపాత్ముఁడవు. వాఁడే పుణ్యవంతుఁడు" అని నుడివెను. కనుక నెంతవారికిని బరదూషణమునఁ బాపము సంక్రమించును.

## ౨. ముఖస్తుతి.

బాలుఁడా ! దీనిని నీవింకను నాచరింప నెఱుంగవు. కాని చూచియుందువు. ఇదియు స్వోదరపూరణమాత్రమున కుప

యుక్త మగువంచనాస్త్రము. ఈయస్త్రమునకు మంత్రము
కుహనాస్తవము. లక్ష్య మాత్మకార్యసమర్థనము.

ముఖస్తుతి చేయువాఁ డుందున దొకటి చెప్పునది మఱొకటి.
వీనికిఁ ద్రికరణశుద్ధి మొదలే యుండదు.

తనయెఱిఁగినదానినేని వీని కున్నదున్నటులఁ జెప్ప వీలులేదు.
ఆత్మవంచనమునకుఁ బాల్పడవలయును. సత్యమును జెప్ప
సందేహింపవలయును. అభిమానము నణఁచివేసికొనవలయును.
ముఖస్తుతిపరాయణులు తమకార్యముల గట్టెక్కించుకొనుట
కిన్నికడగండ్లు వడవలయును. ఇది యనుచితకార్య మనియెఱిం
గియుండియు నెదుటివారి యభిలాషముకొలఁది ప్రవర్తించె
దరు.

వీరిని బ్రేరేపించువారు ముఖస్తుతిప్రియులు. స్తోత్రము చేయు
వారికంటె దాని నభిలషించువారే పరమనీచులు. తమప్రో
త్సాహమునఁగదా వారాపనికిం గడంగునది? తాము వినకున్న
నెవరు విన్పింపఁగలరు? ఈప్రయోజక కర్తృత్వమునకు
దోషభార మధికమని వీరెఱుంగరా?

ఛీ! ఛీ! ముఖస్తుతికిఁ బాల్పడువారు మూర్ఖశిరోమణులు.
స్తోత్రప్రియులు పారలౌకిక సౌఖ్యసాధమును బునాదితోఁ
గూడఁ బడఁగొట్టుకొను నవివేకచూడామణులుసుమా!

పాపము! వీరు పొగడిత నొకక్రీడాభేదముగాఁ దలంతురు.
తూఁగుటుయ్యెలపై విలాసముగా శయనించి మొగంబునఁ

జిఱునగవు దొల్కాడఁ దమగుణగణములఁ గర్ణరసాయనముగా నాలించుచు నానంద మొందుచుందురు. ఒక్కొక్కప్పు డానందాతిరేకమునఁ బరవశులై యీాబట్టువాండ్రి యభీష్టముల నెఱవేర్చుటయుఁ గలదు. ముఖస్తుతికి ఫల మదియేగదా ? వీ రాయవగుణమునకుఁ బాల్పడక దానగుణముచే రాణింప రాదు గాబోలు !

మొగము నెదుట దూషించు చున్నప్పుడు క్షమావంతుఁ డోర్చు కొనఁగలఁడు గాని భూషించుచున్నచో నెవరేని యెట్లు సహింపఁ గలరో గదా ? కట్టా ! లజ్జాగుణము వీరిని బొత్తిగ నుజ్జగించి వేసినది.

" నీవిందుఁడవు. చందుఁడవు " అని తన్నుఁ బొగడుచుండ నిజ ముగాఁ దా నైతినని యే తలంచుంగాఁబోలు నానందమునఁ దల యాడించుచుండును ! ఆహా ! యిదియెంత విచిత్రము ! ఇంతకంటె నిందాజాలము మఱొకటిగలదా ? ఓస్తోత్ర ప్రియుఁడా ! " ఈస్తోత్రపాఠకులు తమకార్యార్థము నన్నుఁ గొండమీాఁదఁ గూర్చుండఁబెట్టసాగి రని నీవు తలంపనంతవఱకు వారు నిన్ను వదలరు. ఈస్తోత్రమున నతిశయోక్తు లత్యుక్తులు స్తుతినిందలు నున్నవని నీవు తలంపనంతవఱకు వారు నిన్నువద లరు. ఈస్తోత్రమువలన నాకీర్తి సర్వదిగంతములవరకు వ్యాపిం చుచున్నదని తలంచుట పొరఁబాటు. కీర్తికిబదు లపకీర్తియే

వ్యాపించు చున్నదని నీవు తలంపనంతవఱకు వారు నిన్ను వద
లరు.

స్తోత్రప్రియత లేకున్నఁగాని స్తోత్రము నశింపదు. స్తోత్రము నశించినఁగాని స్తోత్రప్రియత నశింపదు. ఈయన్యోన్యాశ్రయ దోషమును వివేకిగాని గ్రహింపఁలేడు. వీని యవినాభావసంబంధమును వివేకిగాని త్రుంపలేఁడు. సంబంధమునే యేమి? ఈ రెంటినిగూడ నాశనముచేసినఁగాని శీలము నిరుపష్టమైనది కాదు.

ఓస్తోత్రాభిలాషీ! నీపరోక్షమున నెవ్వరైన నిన్నుఁ గొండాడినచో నది మనఃపూర్వకమైనది సత్యమైనది కాని నీయపరోక్షమునఁ జేసిన నుతిమాత్రము మనఃపూర్వకమైనది సత్యమైనది గాదని గట్టిగా నమ్ముము. నీయెదుటఁ జేయుపొగడిక నిన్ను బ్బించుటకే. నిన్నుఁ దలక్రిందు చేయుటకే. నిన్ను వశ్యుని జేసికొనుటకే.

ఓయీ! నన్ను వర్ణించినఁగాని యీకార్యముచేయనని యేల పొగడించుకొనియెదవు? నన్నుగుఱించి యొకపద్యమును జెప్పు మనియేల పొగడించుకొనెదవు? నన్నుఁగూర్చి పత్రికలలోఁ బ్రశంసింపవయ్యా! యనియేల పొగడించుకొనెదవు? ఈయవివేకమును దూరముచేయుము. అవికత్థనుండవై యసమునార్జింపుము. బలవంతముగా నీవు పొగడించుకొనినను నవ్వాలికేగి వారు నవ్వెదరు సుమా! ముఖస్తుతు లాచరించువారు

మర్మవిదులగుట నవ్వులికేగి గేలిసేయ కేల యూరకుందురు?
"నలుగురు నన్ను గొప్పవాఁ డనితలంపవలయు" నని నీ వభి
లషింతువేని సత్కార్యము లాచరింపుము. సత్కార్యముల
వలనఁ గీర్తి చేరునుగాని సన్నుతులవలనఁ జేరదు సుమా !
నీవే స్తోత్రార్హుఁడ వైనచో - నీవే గుణవంతుఁడ వైనచో -
నీయప్రత్యక్షమందే నీకీర్తి ప్రశంసలు భూనభోంతరాళముల
నిండును. మల్లికాకుసుమమువలెఁ గీర్తిని దాచిన దాగదు.
గాలివలె దానికిని వ్యాపకతాశక్తి కలదు.

సుగుణవంతుఁడు ముఖస్తుతికిఁ బరాఙ్ముఖుఁ డగును. మిక్కిలి
లజ్జించును. పరులు తన్నెదుట నగ్గించుచున్న నది దూషణ
ముగా భావించును.

గుంపుగాఁ జేరి కొండాడువారు చాక్రికులు. వంశకీర్తనము
చేయువారు మాగధులు. పరాక్రమాదులఁ బ్రశంసించువారు
వందులు. వీరిని రాజులు స్తోత్రకార్యమునకుమాత్రమే తమ
యొద్ద నిల్పుకొందురు. ఇది యేమిసదాచారమో ? కూడు
గుడ్డనిచ్చి కొన్నివంశముల నుద్ధరించుట సముచితమైనకార్య
మేకాని యందులకుఁ బ్రతిఫలముగా వారిచే నెట్టయెదుటఁ
బొగడించుకొనుట యేమియుచితమో నాకుఁ దెలియుటలేదు.

ఈదాత్మతాగరిమ మెంతమాత్రము సుకృత మిూఁజాలదు.
స్వాతంత్ర్యము ననుభవించుచు సహకారశాఖపై నుండి కోకి

లము గానము చేయు చున్నప్పు డుండు నానంద మది పంజర బద్ధమై బలాత్కారముగాఁ బలుకుచున్నప్పు డుండునా? ఇది రాజుల కెట్లానందకరమోగదా?

బాలుఁడా! మకరాక్షీర మగుహాదంబునట్లు స్తోత్రపాఠమును బరిత్యజింపుము. ఆపాఠమును వల్లెవేయకుము. ఆపాఠమును బఠించువారినిగాని పఠింపించువారినిగాని సమీపింపకుము. వారు కపటస్వభావు లని జ్ఞప్తియుంచుకొనుము.

## 3. అపకారచింత

బాలుఁడా! అపకారచింత వైద్యుల కందని ఘోరతరవ్యాధి. ఇది పరిణామదారుణము. దీనికి మందు భగవంతునకే తెలియవలయును. దీనిస్పర్శ మొందినవానిముఖ మనవరతము కాంతివిహీనమై యుండును. వాఁ డెల్లవేళల ధుమధుమ లాడు చుండును.

కాలవ్యాళమునువలె నపకారపరుని జూచి యందఱు భీతిచెందు చుందురు. దాని ఘోరవిషజ్వాలాజాలములవలె నపకారి చూపు్కలు పరిసరములఁ బ్రాఁకుచుఁ బాధుచేయు చుండును. దాని నడకలవడువున నపకారితలంపులు వంకరలై యుండును. అది ఫణామణింజూపి వంచించునట్లు దుష్టుఁడు మంచిమాటచే సమీపమునకుఁ జేర్చుకొని వంచించును.

పాముపగ యొక్క కాటుతో నుపశమించును. అపకారిపగ యెన్ని కాటులకు నుపశమింపదు. సర్పము తనకొత్తిడిగల్గించినఁ గాటు వేయును. వృశ్చికము తన్నుఁ దాఁకినఁ గుట్టిపోవును. అపకారి తనజోలికి రానివారినిఁ గూడఁ బట్టి బాధించును.

అపకారియందు మానవత్వము లేదు. "జ్ఞానేన హీనః పశుభిస్సమానః" జ్ఞానము లేనివాఁడు పశువుతో సమానుఁ డనితలంచి వీనిని ద్విపాదపశువందుమా ? స్వోదరపూరణమాత్రంబునఁ దనివిసనమి నాతరగతియు వీనికి లేదు. పోనీ వృక్షజాతిలోఁ జేరినవాఁ డందుమా ? అదియు సముచితముగా లేదు. ఏల యన ?

మ. అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబునం దుండు నా
తపవర్షానిలవహ్ని వారణములై త్వగ్గంధనిర్యాసభ
స్మ పలాశాగ్రి మరందమూల కుసుమచ్ఛాయా ఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు భూజనుల కీయుర్వీజముల్ గంటిరే ?

వృక్షము లెవ్వరికి నపకారములు సేయవు. ఒంటరిగా నుండును. ఎండ-వాన-గాలి-నిప్పు-వీనివలనఁ గలుగుబాధలనుండి రక్షించును. బెరడు-పరిమళము-చిగురు - బూది - ఆకు-పూఁదేనె - బోదియ - పువ్వు - నీడ-పండు-వీనిని వలసినవారికి వలసినట్లొసంగి మేలుచేయును. ఇట్టిచెట్లతోఁ బాపియు దుష్టుఁ డెట్లు పోలఁగలఁడు? అపకారి స్థావరముల తరగతిలోను జేరఁడు. వానితరగతిని భగవంతుఁడ యేర్పఱుపవలయును.

“ చిఱుచేఁపలఁ బెద్దచేఁపలు మ్రింగుచున్నవి. చిన్నజంతువులఁ బెద్దజంతువులు చంపుచున్నవి. బీదలను ధనికులు పీడించుచున్నారు. ప్రపంచమున బలిష్ఠులు బలహీనుల నడంచుచున్నారు. ఇది ప్రకృతికి సహజమైనట్లే కన్పించుచున్నది. మేమును నాత్మలాభమునకై యొరుల కపకారము చేయుచుంటిమి ” అనువారు కొందఱు గలరు. వీరు రాక్షసుల తరగతిలోఁ జేరెదరు.

మ. తమకార్యంబు పరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబు ఘటించుచుం బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
తమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగ శక్యమే యేరికిన్.

తమపనులను జేసికొనక విడిచిపెట్టి యితరులపనులను నెఱవేర్చువారు సజ్జనులు. తమపనులనుగూడఁ జేసికొనుచు నితరులపనుల నొనర్చువారు మధ్యములు. తమపనులు నెఱవేఱుటకై పరులపనులఁ జెడఁగొట్టువారు నరరాక్షసులు. తమకు లాభములేకున్నను వృథాగా నొరులకార్యములఁ జెఱుచువారల కేపేరు పెట్టవలయునో యెవరికిని దెలియదు. అనఁగా వారితరగతిని భగవంతుఁడే నిర్ణయింపవలయుననుట.

అపకారు లెందును గర్హ్యులే. అపకారచింత క్రూరరాక్షసి. దీనిబాధ వర్ణనాతీతము. ఇది వదలినఁగాని మానవత్వము

రాదు. అన్నిటికంటె నెక్కు డపకారము చేయునని మనము వేనిని దలంచుచుందుమో యాచెదపురుగ్వులు సయితము తమపొట్ట కయియే యట్టిచెట్ల కొడిగట్టుట. కాని మానవుఁ డట్లు కాదు. నిష్కారణముగనే యపకారపరత్వమునఁ బొందలుచుండును.

ప్రత్యపకారచింత కొందఱిని వేధించుచుండును. 'మా కప కృతి చేసినవారికిఁ బ్రత్యపకృతి చేయకుంట పౌరుషహీనము గాదా? అసమర్థత గాదా?' అని కంఠోక్తిగాఁ బల్కుచుందురు. ప్రత్యపకారము చేసిననేగాని తాము తమసామర్థ్యమును వెల్ల డించుకొనుటకు వీలులేదు గాఁబోలు?

బాలుఁడా! వీ రెంతయవివేకులో నీ విదివఱకే గ్రహించియుం దువు. ఈపద్యము జ్ఞప్తియున్నదా?

క. ఉపకారికి నుపకారము విపరీతముగాదు సేయ వివరింపంగా
　నపకారికి నుపకారము నెపమెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ!

ఓబుద్ధిమంతుఁడా! నీ కుపకారము చేసినవారికి బదు లుపకా రము చేయుట యేమిగొప్ప? అపకారము చేసినవారికే బదులు మేలుచేసి వారిని దెప్పకుంటయే గొప్ప. నీధీరత్వ మిందువల ననే బయల్పడునది. నీసామర్థ్యము, నీ తెలివి తేటలు, నీసౌజ న్యము నిక్కార్యముననఁగదా ప్రపంచమున వెల్లడియగునది.

అపకారికి నీవు ప్రత్యపకారము చేయుట వాని నొప్పింపఁ దలఁచియేకదా? అట్లయిన నీవు వాని కుపకారము చేయుము.

అందువలన వాఁ డెక్కుడుబాధనొందును. అపకారి కుపకార ము చేయుట శిరశ్ఛేదముతోఁ దుల్యమని భావింపుము. అపకారి కపకారము చేసినదానికంటె నుపకారముచేసియే వానిని మిక్కిలి తపింపఁ జేయఁగలవు.

బిడ్డా! అపకార మొందువానికంటె నపకారముచేయఁ జింతిం చువాఁడే యధికబాధాపరితప్తుఁ డగును. నీవపకారిని జయిం పఁ గోరెదవేని వానిచేయునపకారములఁ బ్రీతితో నాహ్వా నింపుము.

అపకారిని నీవు చంపఁబూనినది పిఱికితనముననే సుమా ! నీవు ధైర్యవంతుఁడవే యైనచో వాఁడు నన్నేమి చేయఁగలఁడు ? అని వానిని నిర్లక్ష్యముగానే చూచియుందువు. ప్రత్యపకార చింత యసమర్థులకే యుండునది. పృథ్వీరా జెన్నిపర్యాయ ములు మహమ్మద్ ఘోరీని బట్టుకొని చంపక వదలిపెట్టలేదు? శత్రువు హృదయమును గలంపఁగోరి చంపి శాంతినిగూర్చు చుంటివి. నీవు తలఁచిన దొకటి చేసిన దొకటి గాదా?

నాయనా ! నీవు ప్రత్యపకారము చేసి గౌరవముఁ బొంద వాంఛించుచుంటివి. కాని యది పిచ్చితలంపు. వానియప కారముల క్షమించినందువలననే నీ కెక్కుడు గౌరవము కల్గును. అట్లుగాక యపకారమునే చేయసాగెదవనుకొమ్ము. అది దైవి కముగాఁ దప్పిపోవు ననుకొమ్ము. అప్పుడు వానికంటె నీవే

యెంతదుఃఖం చెదవో యూహించితివా ? ఈనీయపజయము వానికి విజయమేకదా ? ఇప్పుడు నీవు నీచేతులతోడనే దుఃఖముఁ దెచ్చికొన్నట్లు గాదా ? ఏల యీయవిచారమూలం బగుకార్యము ?

కోపము పాపకార్యములఁ జేయించునని యెఱుఁగుదువుగదా? కోపమువలననే ప్రత్యపకారచింత పుట్టునది. ఇఁక నీవు పాపము చేసికొనియెదవో పుణ్యము చేసికొనియెదవో ?

బాలులారా ! మీ రొకరిపై నొకరు కొండెములు చెప్పికొనియెదరు. నీలోపముల వాఁడు వెల్లడించెనని వానిలోపముల నీవు వెల్లడింపఁ బూనెదవు. లోపముల వెల్లడించుకొని మీలో మీరు లోపములు లేకుండఁ జేసికొనుట మంచిదేగాని కొండెములుగా నొరులతోఁ జెప్పుటమాత్రము నీచకార్యము. ఇట్టి మొక్కలే మాలినులగునవి. తుదకు గోటఁబోవువానిని గొడ్డటఁ బోఁగొట్టవలసివచ్చును. వానిపాపము వానినే కాల్చివేయును. నీవుమాత్రము ప్రత్యపకారము చేయఁ దొడరకుము. నీకుఁ బరుఁడపకారము చేయఁగూడదని యెఱుంగుదువుగదా ? పరునికి నీవుమాత్ర మపకారము చేయఁగూడదని యేలయెఱుంగవు ?

గీ. "దినము రాత్రులు ఋతువులు మనుజుచేయు
సుకృతమును దుష్కృతంబును జూచు చుండు."

కనుక నపకారి తప్పక భగవంతునిశిక్షకుఁ బాత్రుఁ డగును. నాయనా ! యెఱిఁగియెఱిఁగి యేల యితరుల కెగ్గొనర్చెదవు? పరిశాంతహృదయుఁడవై యుండుము.

## ౮. దురభ్యాసములు.

బాలుఁడా ! వినుము.

శ్లో. శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్
వార్ధకే మునివృత్తీనాం యోగే నాంతే తనుత్యజామ్.

పూర్వము సూర్యవంశపురాజులు బాల్యమునఁ జదువుకొనెడివారు. ప్రాయమున నింద్రియసుఖ మనుభవించెడివారు. ముసలితనమున మునివృత్తి నవలంబించెడివారు. అంత్యకాలమున యోగబలముచే శరీరమును వదలిపెట్టెడివారు. నేఁడు మనవారో బాల్యమున దురభ్యాసముల నేర్చికొందురు. ప్రాయమున నరిషడ్వర్గము సప్తవ్యసనముల నాశ్రయింతురు. ముసలితనము రాకపూర్వమే కూటికి గుడ్డకు నల్లాడి రోగాదులచే శరీరముఁ ద్యజింతురు.

బాలుఁడా ! ఈదురవస్థకుం గారణములఁ దెలిసికొంటివా ? బాల్యమున దురభ్యాసములకు వశ్యులగుటవలననే. పునాది గట్టిగా లేకున్న సౌధ మెట్లునిలుచును ? కనుకఁ జిన్నతనమునందే మంచియలవాటులు కలిగియుండవలయును. చెడ్డయలవాటుల నలవఱచుకొనరాదు.

అలవాటును దొలఁగించుకొనుట కష్టము. అది మంచిదైనను జెడ్డదైనను సరియే. అది జీడివంటిది. అంటుకొనిన సులభముగా వదలిపెట్టదు. జీడి యొంటినచో నేమియుఁ జేయదు. ఒంటనిచో మిక్కిలి పీడించును. అట్లే యలవాటు లాదియందుఁ బ్రకృతికి మంచివే సరిపడును. చెడ్డవి సరిపడవు.

ఒకటిరెండుదినము లొకకార్యము నాచరించినచో మూఁడవ దినమున మన మూరకున్నను నాపనియే మనల మేల్కొలిపి చేయించుకొనును. మనంబును బురస్కరించుకొని యింద్రియంబు లాకార్యమువంకకు గుఱ్ఱములవలెఁ బర్వెత్తసాగును. నట్టిను గాడికిరిందికిఁ దెచ్చినట్లే యామనంబును వెన్కకు లాగఁ గష్టము. ఇదియే యలవాటు. ఇఁక మన మా యలవాటును విడువలేము.

### చుట్ట - బీడీ - సిగరెట్టు

ఇవి నరుల నాశనముచేయు ననుకూల శత్రువులు. ఇవి నమ్మించి గొంతులు గోయుచుండును. మానవునిప్రకృతి ప్రప్రథమమున వీనిని నిరసించును. త్రాగఁగూడ దనిబోధించును. త్రాగినచో బాధించును. కాని లాభమేమి? ప్రకృతికి విరుద్ధముగా నరుఁడు మొండిపట్టు పట్టి నానావిధముల గోడుగుడిచి వానిని జివలఁ కిముడ్చుకొనును. ఎందుకో యీయవస్థ? వీనిని ద్రాగినఁ గడుపా నిండదు. క్షుధాగ్నియా చల్లారదు. ఆరో-

గ్యమూ లేదు. బలమూ శూన్యము. కాని వీనికే దాసాను దాసులై చరించుమానవుల మూర్ఖత నేమనవలయును ?

వీనిసేవవలన లాభములు లేకపోఁగా నష్టములే మిక్కిలిగాఁ గలవు. వీనిధూమ మూపిరితిత్తులలోఁ జేరి యాకోశము ననేక విధములఁ జెఱిచివేయును. వీనిసారము ద్రవరూపమున లోనఁ బ్రవేశించి పనరై వ్యాధులఁ బుట్టించును.

నాయనా! ఈధూమపానమువలన రక్తము చెడిపోవును. సుంద రమైన వక్షస్థల మెండిపోవును. కన్నుల కాంతి సన్నగిల్లును. మోమందము డిందుపడును. ఓష్ఠములమార్దవము మడఁగి పోవును. హృదయము పట్టుదప్పి సంచలింప సాగును. ఒకఁడు రెం డననేల? అది త్రాగువాని ముఖదుర్గంధమే యది చెడ్డ దనుటకు నీకుఁ బ్రబలసాక్ష్యము. ఇన్నివిధముల ననర్థహేతు వైన యీధూమపానదురభ్యాసము నేల కొనితెచ్చికొనవల యును ?

బాలుఁడా! లోకములో ననర్థములఁ దొలఁగించుకొనఁ గోరు వారు కలరుగాని వాని నాహ్వానించి తాము చెడిపోవఁ గోరు వారు కలరా? నీ వట్లపకారకరములు ననుపయుక్తములు నగు నీదురభ్యాసముల నాహ్వానించి పిచ్చివాఁడవు కాఁబోకుము.

పాఠము

ఇదియు నొకవిచిత్రమైన యంటురోగము. పయోముఖవిష

కుంభము వంటి దీనింజూచి ప్రిప్రథమమున నందఱు మోస
పోయెదరు.

పామరుల * చుట్ట పండితులనస్యము నేకగర్భజనితములే.
అందువలనఁ బితార్జితమైన దుర్గుణధనం బిర్వురుసోదరులకుఁ
దుల్యముగనే సంక్రమించును. కానఁ జుట్టకంటె నస్య మెక్కు
డనియు, నస్యముకంటెఁ జుట్ట యెక్కుడనియుఁ దగవు లాడ
వలదు. అయినను దమతమయాస్తులను వినియోగించుకొనుట
యందుమాత్రి మెచ్చుతగ్గులు కలవు. తనయాస్తిని † జుట్టా
రావు నక్కినక్కి ద్రవపదార్థముగనో వాయుపదార్థముగనో
మార్చి పరులకుఁ బంచిపెట్టును. నస్యశాస్త్రి పండితులయండ
లభించుటం గావలయు నిర్భయముగా బహిరంగముగా ఘన
పదార్థముగా మార్చి పంచిపెట్టును.

చుట్టారావు భీరుఁడు. నస్యశాస్త్రి నిర్భయుఁడు. రావు నోరు
గఱచుకొనును. శాస్త్రి ముక్కుపట్టుకొనును.

భూమపత్రిమున కవతరించిన యీయిర్వురుబిడ్డ లెట్లో తండ్రి
పేరు నిల్పుచు సర్వదేశముల వ్యాపించి వ్యాపారముచేయ

మొదలుపెట్టి మహాయశస్సు నార్జించిరి.
పాపము ! చుట్టారా వమెరికానుండి ప్రిప్రథమమున నింగ్లండు

* చుట్టకుమారులే బీడీసిగరెట్లు.

† చుట్టయే చుట్టారా వయ్యెను. అట్లే నస్యము నస్యశాస్త్రియగుచు.

దేశమునఁ గాలువెట్టినపుడు కొన్నికొన్ని పరాభవములకుఁ బాల్పడవలసివచ్చెను. అందొకటి—

సర్ వాల్టర్ ర్యాలే అను నాంగ్లేయుఁ డమెరికానుండి యింగ్లాండువచ్చి తనయింటఁ గిటికీవైపు వీపుంచి పడకకుర్చీలోఁ బండుకొని ధూమపానము చేయుచుండెను. చుట్టసంగతి నెఱుంగని సేవకుఁడు తనయజమానునిం జూచి 'నోటనుండి ముక్కులనుండి పొగవచ్చుచున్నది- లోపలఁ దగులఁబడుచున్నట్లున్నది- లేకున్నఁ బొగ యేలవచ్చును ? ఆలస్యముచేసిన నొడలంతయుఁ గాలిపోవు' నని తొందరతొందరగా వెళ్ళి రెండుకడవలనీళ్ళు తెచ్చి యార్యాలే నెత్తిపైఁ బోసెను. ఆయన యుద్రుగుడుచుకొని యెట్లో తెప్పరిలి కేకవేసి యాయపాయమునుండి తప్పించుకొనియెను. అప్పటినుండియే యింగ్లాండు దేశము చుట్టారావునెఱింగి గౌరవింప మొదలుపెట్టినది. పిమ్మట మనమూరావుగారి కాతిథ్య మిచ్చితిమి.

పొడుముపట్టి

చుట్టత్రాగువారికి దర్పమెక్కువ. కనుక వీరిని బరాభవింపవలయునని పొడుముఁ బీల్చునేస్తులు కొందఱు కలిసి యొక గృహమునిండ "ఈనిర్మలస్థలమున నుమ్మివేయకుఁ"డని వ్రాసి యుంచి చుట్టత్రాగువారి నేదోపేరున నటకాహ్వానించి తాము మాత్రము నిర్విచారముగాఁ జూర్ణముఁ బీల్చుచు నాసికారంధ్ర

ములనుండి నల్లనియూట స్రవించుచుండ నటునిటు తిరుగుచుం డిరి. ఈధూమపానము చేయువారు లోలోన విచారించు చుండిరి. అందొకధూర్తుఁడు మిక్కిలియాలోచించి నిష్ఠ్యూతి కెక్కుడను దావు లభింపమి ఘుభక్కునఁ బొడుము పీల్చువాని ముక్కుపై నుమిసెను. వాఁ డిదేమని గర్జింప నతం డిట్లుజవా బిచ్చెను.' నేను మీవిధుల నతిక్రమించి నడుచుకొనలేదు. నిర్మల స్థలమున నుమ్మివేయలేదు. కసవుఁగుప్పమీఁదనే కసవువేసితి' ననెను. పొడుము పీల్చువారికి నాసికారంధ్రములనుండియుఁ జుట్టత్రాగువారికి ముఖరంధ్రమునుండియుఁ గళ్మలద్రవము కాఱుచుండును. నస్యము తుపాకిమందువలె నాసికా నాళ ముల నాశముచేయుచుఁ బోవుచుండును. శత్రువు లగ్గ పట్టిన ట్లది తలకెక్కి మెదడును దినివేయుచుండును. ఇంక నాఘ్రాణానురక్తి యాలోచనాశక్తి గగనకుసుమము లేకదా? పదుగురుఁ దన్ను బహూకరింతు రనిభావించుటం గాఁబోలుఁ బామరుండును నస్యస్వాములవారిని సేవించుచుండును. సర్వ మానవులందు సౌభ్రాత్రము నెఱపుటకుఁగాఁబోలుఁ దనచూర్ణ మొరులకిచ్చి యొరులచూర్ణముఁ దా నాదరించును. జడంబుల నేని జాలిమెయిఁ గందు ననుటకుఁగాఁబోలుఁ దనపొడుము కాయకు బంగరుపొన్ను వెండి'బిరడా' బంగారపుగొలుసు చేయించును. "మురారివలె గురుకులక్లిష్టుఁడనై చదివికొంటి"

నని తెల్పుటకుఁగాఁబోలు రేయనక పవలనక పొడుముబిరడా దీయక పాత్రమును దెఱువఁడు.

కొందఱు పొడుముఁ బీల్చకున్న మాటలాడలేరు కొందఱు *పంట్లాంజేబులోఁ జేతులుదూర్చకున్న నుపన్యసింపలేరు. కొందఱు చుట్టత్రాగకున్న నన్న మఱిగించుకొనలేరు. కొందఱు కాలూగు లాడింపకున్నఁ గూర్చుండలేరు.

నాయనా! ఒక్కొక్కరి కొక్కొక్కయలవాటు. పొడు మల వాటు పోవుటకుఁ జుట్టత్రాగి, చుట్టయలవాటు పోవుటకుఁ గాఫీత్రాగి, కాఫీయలవాటు పోవుటకుఁ జీట్లాడి యిట్లు మాన వులే యొక్కదురభ్యాస మంటుకొన్నను దానిని బోఁగొట్టు కొనఁ బ్రయత్నించి తుద కన్నిదురభ్యాసములకు లోఁబడి జిగురాకులకుఁ జిక్కుపులివలె నలసిసొలసి పడిపోయెదరు.

అడుసు త్రొక్కనేల? కాలు గడుగనేల? మొదలే దాని తెరువు సనకున్న లగ్గుగదా!

నాయనా! పండితులే తప్పని యొప్పుకొనుచు నాయొప్పమిని దప్పుకొనలేక తిప్పలువడుచుండ నీవేటికిఁ బొడుము నంటు కొనెదవు? కొందఱు రేయి చదువుకొనునప్పుడు నిద్రవచ్చిన దాని నాపుటకు దీని నుపయోగించెదరు. అది మిక్కిలితప్పు. కొందఱు తమపొజ్జకు దీనిని సిద్ధముచేయుచు నలవరించుకొనె దరు. ఇట్లలవాటు లెన్నియో తెలుఁగుల నంటుకొనును.

అలవా టైనపిదపఁ గష్టముగనుక ముందుగనే మేల్కొని యుండవలయును.

మద్యము — గంజాయి

గంజాయి 'జ్ఞానపత్రి' యనియు దానిని త్రాగిన మనశ్చాంచల్య మాగిపోవుననియు, నట్టి నిశ్చలచిత్తమును భగవత్పరాయత్తము చేసిన నెంతమేలు గలుగదనియుఁ గొందఱు వాదింపఁజూతురు.

కొందఱు కల్లు సారాయి త్రాగిన ధైర్యసాహసములు గలుగుననియు నప్పు డెట్టి దుర్ఘటకార్యములనైని యవలీలగా నొనరింపవచ్చుననియు వాదింపవత్తురు.

అది వట్టిభ్రమకాని ప్రమకాదు. వా రట్లుతలంచుటయే కాని కార్యరూపమునఁ బరిణమించునప్పటికి వ్యత్యస్తఫలము లభించును. వారప్పటికి విస్మృతిపథమునఁ బయనించుటచే దానిని గమనింపలేక పోవుచున్నారు.

వారు చేఁజేతులఁ దెచ్చుకొనిన యాబాధలు నాయవస్థలు తదితరులకు స్పష్టముగానే కన్పట్టు చుండును.

ఎందఱు మద్యపానమున నొడలెఱుగక ప్రవర్తించుచు లజ్జాశూన్యులై వీథులవెంటఁ బొర్లాడు చుంటలేదు ? ఇదంతయు వారు సూకరములవలె సుఖముగనే భావించు చుందురు. కష్టపడి పనిచేసి పావలాడబ్బులు సంపాదించి యింట నన్న

మోరామచంద్రా! యని యాలుబిడ్డ లేడ్చుచున్నను సరకుఁ గొనక యీదురభ్యాసమునకు బద్ధులై యిట్లు ప్రవర్తించుచున్నారు.

బాలుడా! యిది మంచిపనియేయని నీకుఁ దోఁచుచున్నదా? కల్లు-సారాయి-బ్రాంది-విస్కీ-బీర్-మొదలైనవానిని గ్రోలుట వలన లాభము లున్నవని నీవు తలంచుచున్నావా? తలంపవని నే నెఱుంగుదును. త్రాగెడివారుగూడఁ జెడ్డవని యొప్పుకొనుచు 'నేమిచేయుదుము-అలవాటైనది-వదలలేకున్నాము' అని విలపింతురు.

కనుక నొకతూరి దీనిని స్పృశించితివా రెండవసారి బుద్ధి పుట్టితీఱును. రెండవపర్యాయ మయ్యెనా యిఁక నీబూతరాకాసుల వదలించుకొన నేరవు. మొదటనే వాని తెరువుపోక జాగరూకుఁడవై యుండఁ బ్రయత్నింపుము.

### ద్యూతము

ద్యూతము నట్టిదియే. పూర్వము నలధర్మజాదులు సమస్త రాజ్యముఁ గోల్పోయి యడవులపాలై పెక్కిడుమలఁ గుడిచిన దీద్యూతక్రీడాసక్తతనే. మహాధర్మాత్ములు సత్యసంధులునైనవారే యీదుర్ద్యూతఫలము ననుభవింపఁగాఁ గించిద్‌జ్ఞులమైనమనమా తప్పించుకొనునది?

ఈజూదము నాఁడు పాచికలతో నాడిరి. పిదపఁ జదరంగములు

బయలుదేరినవి. నేఁడు 'చీట్లపేక' యెక్కడఁజూచినఁ దాండ
వించుచున్నది.

నాయనా! వీనిసంబంధ మొక్కసారి నీకుఁగల్గినఁ జాలును.
ఇఁక నీవు వీనికిఁ బరతంత్రుఁడవై పోదువు. నీ వాడకపోయి
నను జూచినం జాలును. పిదప నీ వేమిచేయుచున్నను నీమ
నంబు వానినిగుఱించియే తలపోయుచుండును. నీకు నిద్రలో
నయిన మాస్వప్నములే వచ్చుచుండును. నీవు వానినిగూర్చియే
కలవరింప సాగుదువు. మఱొకపనియు నీకుఁ దోఁచదు. వాని
నిఁక విడిపించుకొన నీతరముగాదు.

ఒకఁడు చీట్లాడుచున్నప్పుడు తల్లి చనిపోయినదఁట. రమ్మని
పిలువఁగాఁ దదాసక్తచిత్తుఁ డతండు విసుగుకొని శవము నీ
మార్గముననే తెత్తురుగదా? యని యుత్తరమిచ్చి యాడుకొ
నుచునే యుండెనఁట. ఇందు కేమియు సందియములేదు. అవ్య
సన మట్లుకల్పించును. దానియం దంతసామర్థ్యము కలదు.

బాలుఁడా! ఈయాటలవలన మిత్రులు శత్రులగుదురు. గౌర
వము దూరముగాఁ బాఱిపోవును. ధనాదికము వినాశ
మొందును. ఆలుబిడ్డ లల్లాడిపోదురు. బంధుగులు పంచకుఁ
జేరనీయరు. ఇట్లు సర్వానర్థపరంపరల కునికిపట్టగువీనియం
దింతయభిరుచి యెక్కడనున్నదో?

కట్టా! యీద్యూతము కరం బశనిపాతము. దుష్టునిఁ జూచి
తొలఁగిపోవలయును గాని దీనిని జూడకయే తొలఁగిపోవల

యును. అనలమును స్పృశించినఁ గాల్చును గాని యిది స్పృశింపకున్నను గాల్చివేయును.

వేడుకగానైనఁ బొద్దుపోకకైన నీయాటల నేర్చికొనకుము. నేర్చికొంటివా బండకొయ్యలోఁ గాలుదూర్చినట్లే. నేర్చికొని వదలిపెట్టవచ్చునులే యని మెత్తపడితివా యుబ్బలిలోఁ గాలుపెట్టినట్లే. నాయనా! ఈదుర్వ్యాత దురభ్యాసములకు దూరముగానుండుము.

### చిఱుదిండి

చిఱుదిండియు నొకచెడ్డయలవాటు. దీనికిఁ జిన్నలు పెద్దలు నను తారతమ్యము లేదు. ఆదియందు ముద్దుగా బయలు దేఱును. అవ్వల మొద్దుగా బయటఁబడును. బలకరమైన యాహార ముపభోజ్యము కాని వేళకాని వేళల నీకూళతిండి యేల? ఏ ముపయోగము ?

బాలుఁడా! నీవు ముప్పొద్దులఁ దగినయోగిరమును దినుచున్న నది యారోగ్యకరము బలప్రదము కాని యసమయముల నల్పాహారము లెట్లగును? అవి జీర్ణమగుటకేని యవకాశ ముండ వలయునుగదా ? ముప్పూటల భుజించువాఁడు చిఱుదిండి దిన నవసరములేదు. అన్నంబు జాములో జీర్ణంబగు ననుపెద్దల వాక్యము వినలేదా? జాములోనవే మరలఁ జిఱుదిండి యేల ? ఆఁకలిగానితిండి యగచాట్లకు గండి. జీర్ణముకావలసిన పదార్థమే యుదరాగ్నియందు మిగిలియుండఁ బైఁగా నింకను

బదార్థ మేలపై చెదవు? అధికమైనహావనీయ మన్నువయగు ననలము నణఁచివేయదా ? ఉదరకోశము భరింపవలదా ? 'నా కేమి భరించునది కుక్షిగదా 'యని జిహ్వా గంతులువైచుచు నెంతయాహారమునైనను లోనికి నెట్టుచుండును. ఇట్లుగదా యజీర్ణరోగరా జేర్పడి యనుచరులం గూర్చుకొని యంగ రాజ్యమును బాలించునది ?

తలిదండ్రులే శిశువుల కీ యంటురోగమును దార్చునది. లేక లేక యొకలోకాయవుట్టఁగా నన్నికోర్కులు వానిపైఁ బెట్టుకొని యన్ని వేడుకలు వానివలనఁ దీర్చుకొనుచు నత్యంతప్రేమముచేఁ దాయముతాయమని చంకబిడ్డకుఁ దాయముఁగొని పెట్టి చిఱుదిండి యలవాటుచేయుదురు. వారు వాత్సల్యప్రతిసీరవ్యవధానమువలన భావ్యనర్థముల నిరీక్షింపలేకున్నారు. దినములు గడచినకొలఁది నలవాటుపడి బిడ్డలు మారాము చేయమొదలుపెట్ట గారాముసఁ దల్లిదండ్రులు చిఱుదిండి యను పోరామిని దెచ్చిపెట్టుదురు. ఈయభ్యాసమును వారు పెద్ద వారైనప్పటికిని విడువలేరు. ఉగ్గుఁబాలతోఁ బెటిగినదాని నెట్లు సులభముగాఁ ద్రుంచి వేయఁగలరు ?

కొందఱు తండ్రులు నాలుగైదేండ్లబాలుని గేలువట్టికొని నడిపించుచుఁ గాఫీహోటళ్ళకుఁ దీసికొనిపోయి కాఫీయిడ్డెన్ల మేపి తమముచ్చటఁ దీర్చికొందురు. ఇది ముచ్చటా ? బాలుని గోతిలో గుచ్చుటా?

కొందఱుతల్లులు, భర్త నానాశ్రమముల కోర్చి మానెడు గింజలు దెచ్చి చేటలోఁ బోసిపోఁగా నందులో సోలెఁడు చిఱుదిండ్లకు వెచ్చపెట్టి మిగిలినవాని నన్నమువండుదురు. ఆసోలెఁడు తేపటికి మిగిల్చినఁ గాఁపురము గొంతకాలమునకైన మెఱుఁ, గెక్కునుగదా ? దూఁబఱదిండికాఁపురము దుఃఖమునకు దాపురము.

ఈతిండిని బాలికలకే యలవఱిచిరా యిఁక నాబాలిక లత్తవారి యింటఁ బడుబాధలకుఁ గొదవయుండదు. చిఱుదిండ్లకు దేవులాటలు. చేపడమి దొంగబాటలు. అరసినచోఁ బోట్లాటలు· ఆఁడుబిడ్డలతోఁ గొట్లాటలు. కట్టా ! చిఱుదిండి స్త్రీలపరువునకుఁ దేలుకొండి. జిహ్వాగ్రములకు దురదగొండి.

క్షున్నివారణమునకా జిహ్వాకండూతి నివారణమునకా ఆహారము ?

అబ్బా ! ఏమినాగరకత ! నిద్దుర లేచిన 7 గంటలకు కాఫీలు. 9 గంటలకుఁ బ్రాత రశనము. 12 గంటలకు మధ్యాహ్నభోజనము. 3 గంటలకుఁ బిండివంటలు. రాత్రి 8 గంటలకుఁ దిండి. అదిపొట్టా ? చెఱువుకట్టా ? కట్టా ! ఈనరులు భుక్తికొఱకే పుట్టినట్టులున్నది.

నాయనా! నీవు కాఫీమొదలైన భూతప్రేతపిశాచముల జోలికిఁ బోకుము. ఒకసారి నాలుకకు రుచి చూపితివా యిఁక నది

యెలుకవలెం గొలంక మొదలుపెట్టును. సంసారము నెత్తిపైం బడినపుడు 'దొంగపోటుకంటె లింగపోటే యెక్కుడు బాధరా' యని చింతింపవలసి వచ్చును. ఉన్న వేళ యుండును. లేనివేళ యుండును. నాలుకముందు నాలుకకుం జెల్లవలయు ననిన నెట్లు? నీ వొక్కఁడవేమైన నెట్లో సరిపెట్టుకొనవచ్చును గాని నిన్నుం జూచి నీభార్యయు నట్టిదేయగును. నీబిడ్డలు నట్టివారే యగుదురు. అప్పుడు నీసంపాదన మల్పాహారములకేని సరిపోవునా? అప్పుడు నీయులవాటును గిరాటు వేయఁగలవా? ఎంతమాత్రము వేయలేవు. అప్పుడు నీయవస్థ భగవంతునికే యెఱుక. రాబడితక్కువ పోబడియెక్కువయైన నాకొంపుర మెన్నాళ్లకుం గడ తేఱునది? నాయనా! చిఱుదిండి రక్కసిని జేరఁదీయకుము.

సప్తమాధ్యాయము - సమాప్తము

ఓమ్.

# నీతివాచకము

## అష్టమాధ్యాయము - వికారములు.

### ౧. పేరాస.

ఆశ యెవ్వరికి నుండరాదు. ఇంక నత్యుత్కటాశ నింద్య మని చెప్పవలయునా? అత్యాశయే పేరాస. ఫలాభిసంధి నన్నియుఁ దుల్యము లే.

నాయనా! ఆశకు మించిన చేటు లేదు. ఆశను నాదరించిన నపరిమితదుఃఖముల కంజలి పట్టినట్లే. ఆశకు మితి యుల్పునకు మతి యుండునా?

తనకు భగవంతుఁ డిచ్చినదానితోడనే సంతసింపక లభింపని దానినిగూర్చి యడియాస నొందనేల? తనజీవనమున కావశ్యక మైనంతధనము నార్జించుకొన యత్నించిన దోషము లేదు. కాని యంతకంటె మిక్కిలి తన కక్కఱలేకున్నను నార్జించి కూడఁ బెట్టవలయు ననునాసమాత్ర మత్యంతక్రూర మైనది.

అది యేమిదురాశయో కాని కొందఱు ధనమును సంపాదించి భూమి నిక్షేపింపఁబ్రయత్నించెదరు. మీఁదు మిక్కిలి యదియు నొకసంతాన భేదమనియు స్వర్గఫల మొసంగుననియుఁ జెప్పఁ సాగెదరు.

కట్టా ! పరులనోళ్లు గొట్టి పేదలఁ గష్టపెట్టి ధనము మూటగట్టి డాఁచిపెట్టి యుంచుటయుఁ బుణ్యకార్యమా ! దురాశ కాదా? ఈయతిధనవాంఛ కాలకూటముకంటె మేటియనిన నేటిలోటు? విషము తననే బాధించునుగాని యాశ తనకుటుంబమును సైతము బాధించును. కన్నకూఁతులఁ గాసుల కమ్ముకొను కఠినాత్ము లెందఱు లేరు ? పొట్టకుఁదినక పెట్టెలోఁబెట్టి నిట్టి పాసము లుండునీచలోభు లెందఱు లేరు ?

ఆశ యాత్మసౌఖ్యముల నడుగంటఁజేయును. కష్టములకుఁ గన్నుగీటును. దుర్యోధనుఁడు సూదిమోపినంత భూమినిగూడఁ బాండవుల కీయఁజాల నని పేరాసవహించిన నేమిఫలముపొం దెను ? పుత్రపౌత్రానుజవర్గసమేతముగా వినాశన మొందెను.

నక్క

తొల్లి యొకవ్యాధుఁ డడవికిఁ బోయి విల్లెక్కు పెట్టి మదించిన సూకరమును బాణంబునఁ గొట్టెను. అదియు వెంటనే పై కుఱికి ముట్టెతోఁగొట్టి వానిని జంపెను. ఆసూకరమును దద్బాణ హతిం బుడమిఁ దెళ్లెను. ఈసూకరవ్యాధపదాహతములచే నొకపాము నచట మృతిసెందెను. ఈశవముల నొకజంబుకంబు చూచి మిక్కిలిసంతసించి 'వ్యాధునిమాంస మొకనెలకు, నేక లమునెఱచి మఱొకమాసమునకు, సర్ప మొకదినమునకు, సరి పోవును. ఇప్పటియాకలి కీవింటెనరమును దిని తృప్తిచెందెద'

నని యత్యాశచేఁ దలంచి యాధనుర్గుణమును దెగఁగొఱుకుడు వెంటనే యావింటిబద్దకొవు ఱొమ్మునకు ఫెడేలునఁ గొట్టుకొనెను. ఆదెబ్బతో నాసృగాలము కాలధర్మ మొందెను. అత్యాశ యాయువును హరించును.

మహాత్ములాశావిష్టుల యాతిథ్యమును నంగీకరింపరు. దుష్టాన్నము దుష్టాన్నముగాఁబోలు? కృష్ణుఁడు రాయబారమునకు వచ్చినప్పు డిందువలననే సుమీ దుర్యోధనునింట విందారగింపక విదురునింట విడిసెను.

సామాన్యజనులకు రేపు గడవని వారికి సంచయేచ్ఛ యొకవేళ నుండినను జీవనమునకు వెఱవవలసిన యవసరము లేని రాజాధిరాజుల కేలనో యీయత్యాశ? కుడుము చేతికిచ్చినఁ బండువనుకొని సంతసించువారికంటె వీరు హీనులు కారా?

అగ్బరు.

అగ్బ రడవిలోనుండు నొక ఋషినిజూచి “స్వామీ! మీరు నిత్యసంతుష్టులు. మీరొక్కటియుఁ గొదవయని తలంపరు. అయినను నన్నుఁ గృతార్థుని జేయుటకు నాయింటికివచ్చి నా సత్కారము నందుఁ”డనెను. దీనికి ముని సమ్మతించి యగ్బరు నింటికి వచ్చెను. వానిని గౌరవించి యగ్బరు భగవంతు నిట్లు వేఁడికొనసాగెను. “ఓదేవా! నీకు జోహారు. నారాజ్యమును వృద్ధిఁజేయుము. నా కధికధనమును బ్రసాదింపుము. నా కింద్రిభోగము నిమ్ము.” ఇట్లు ప్రార్థించుచుండ నాముని

లేచిపోసాగెను. అప్పు డగ్బరు వెన్నంటి 'స్వామీ! నాయిచ్చు బహుమానముల స్వీకరింపుఁ' డని ప్రార్థించుచుండ నమ్ముని నవ్వి "ఓయీ భిక్షుకుఁడ వైననీవు నాకే మియ్యఁగలవు? ఇంతవఱకు నిన్ను రాజని తలంచితినిగాని బిచ్చగాఁడ వని తలంపనైతిని. తలంచినచో రాకుండెడివాఁడనే ?" అని చెప్పి దరిద్రునిబహుమానము నే నిచ్చగింప నని వెడలిపోయెను.

నాయనా! దురాశను జేరనీయకుము. అగ్బరున కెంతయున్నను పేరాసమాత్ర మంతరింపలేదుగదా !

## ౨. క్రోధము.

బాలుఁడా ! వినుము. పాపకార్యములఁ జేయించు కోపమును గూర్చి చెప్పుచున్నాఁడను.

కోపక్రోధామర్షరోషములు నామలింగానుశాసనమందుఁ బర్యాయపదములుగా వ్రాయఁబడియున్నవి. ఆలంకారికు లీషద్భేదవంతములుగా నభిప్రాయపడిరి.

పరు లత్యంత మపరాధముచేయఁగా జనించి యాయపరాధమొనర్చినవానిని జంపువఱకు నుండుమనఃప్రజ్వలనము క్రోధమనియు స్వల్పాపరాధమువలన జనించి పరుషభాషణాది పర్యంత ముండునది యమర్షమనియుఁ బండితరాయజగన్నాథుని యభిప్రాయము. కూరజనాశ్రయంబై వధపర్యంత ముండు నది క్రోధమనియు వీరపురుషాశ్రయంబై ప్రార్థించుపర్యంత

ముందునది కోపమనియు, స్త్రీపురుషుల కొండొరులంగూర్చి కల్గునది రోషమనియు రసార్ణవసుధాకరాదులయందును గలదు. ఇందవాంతరభేదము లెన్నియో కలవు. ఎన్నియున్నను నపరాధము చేసినవారిమీఁదనే కల్గుననిమాత్రి మందఱియభిప్రాయము. అట్లుగాక తదన్య మెట్లగును?

కోపక్రోధాదుల యీయీవద్భేదములు వాడుకలోఁ బరిగణింపఁబడవయ్యెను. కావుననే యమరుఁ డట్లను శాసించెను. కోపమే వృత్తిభేదమువలనఁ గ్రోధమయ్యెను. కోపముకంటెఁ గ్రోధమే ఘోరమైనది. కోపము దూషణాదులవలను గ్రోధము హింసవలననుగదా శాంతించునది?

బాలుఁడా? నీ కపకృతి యొనర్చినవానికిఁ బ్రత్యపకృతి చేయుటకేగదా నీవు కోపించునది? అపకారిని దిట్టినగాని కొట్టినగాని నీకు మనశ్శాంతి కల్గదా? కోప ముపశమింపదా? పాపము! వాఁడు బలిష్ఠుఁడైనచో నప్పుడు నీకోప మేమిచేయఁగలదు? దుర్బలుని చేతియాయుధమువలె నప్పుడు నీకోపమే నిన్నుఁ దాడితుఁజేయును. దుర్బలుఁడు లోలోనఁ గ్రోధాగ్నికింధనము కావలసినదేసుమీ! “ పేదకోపము పెదవులచే” టన వినలేదా ?

క్రోధము నరలోకమును నరకలోకము చేయును. పూజ్యుని దాజ్యుని జేయును. మిత్రుని శత్రుని జేయును. ఇవి నిత్యానుభవము లేకదా!

క్రోధమువలన మస్తిష్కమున కెక్కుడు దెబ్బ తగులును. ఇందు వలన మెదడు చెడి పిచ్చియెత్తుటయుఁ గలదు. ముఖము వికాస విహీనమై వికారము చెందును. కన్నులెఱ్ఱఁబాఱును. నరము లుబ్బును. పెదవులకు దంతపీడ సంభవించును. కనుబొమలు ముడివడును. నోరు పరదూషణ సల్పుచుండును.

కోపికిని ద్వేషికిని భేదమేమి ? ఇరువురు జిఘాంసువులే. ఇరువురు భయంకరాకారులే. ఇరువురు క్రూరులే. కోపికి యుక్తాయుక్త విచక్షణజ్ఞాన ముండదు. స్వపరభేద ముండదు. తాకునది తప్పునది తెలియదు.

శ్లో. ఉత్తమే క్షణకోపః స్యాన్మధ్యమే ఘటికాద్వయమ్
అధమే స్యాదహోరాత్రం పాపిష్ఠే మరణాన్తకః॥

ఉత్తమునియందు నిముసము సేపు మధ్యమునియందు రెండు గడియలవఱకు, నధమునియం దిర్వదినాలుగుగంటలకాలము పాపాత్మునియందు వాడుచచ్చువఱకుఁ గోప ముండును.

గీ. పాపముల కెల్ల నెక్కుడుపాతకములు
సువ్వె క్రోధలోభంబులు సుచరితాత్మ!
వానిరెంటి జయించినవాఁడుగాని
యెందుఁ బరమధార్మికుఁ డని యెన్నఁబడఁడు.

అయ్యా! అన్ని పాపములకంటెఁ గ్రోధలోభములే మిక్కిలి పాతకములైనవి. వాని నణఁపనిచో వాఁడు ధర్మాత్ముఁడు కానేకాఁడు.

గీ. క్రోధలోభనామకు లైనఘోరశత్రు
లిరువు రెరియించుచుండుదు రెపుడు సంత
రంగ మయ్యుభయంబుఁ దొరంగకున్నఁ
గలదె? యూరక బ్రాహ్మణ్యగౌరవంబు.

భయంకరులైన క్రోధలోభము లనుపేళ్ళుగల యిద్దరుశత్రువు లెల్లవేళల మనంబును బాధించు చుందురు. ఆయిర్వురిని జయించినవాఁడే బ్రహ్మజ్ఞాని. కాని రిత్తపలుకుల నాగౌరవము వచ్చునదికాదు.

క. అనుపమ నియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు చే
సినవారికంటె నక్రో
ధనుఁడు కరం బధికుఁ డండ్రు తత్త్వవిధిజ్ఞుల్

మిక్కిలి నియమముగలవారై యపరిమితదక్షిణ లొసంగుచు వేయియాగము లొనరించినవారికంటెఁ గోపము లేనిమానవుఁడే యధికుఁడని తత్త్వజ్ఞులు పలుకుదురు.

గీ. కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడుచెందు
కోప మడఁచెనేని కోర్కె లీడేరు
విశ్వదాభిరామ వినుర వేమ.

అని వేమన్న కోపమును నిరసించినాఁడు. ఏసుక్రీస్తు తా నెంత దూరము చెప్పినఁ గోపమునకు గర్భశత్రువగు ప్రేమనుగుఱించి

యేకదా! ఒకచెంపపై నిన్నెవరైనఁగొట్టినచో రెండవ చెంపను గూడఁ జూపింపు" మని యాయన బోధించుటయే కాక యాచరించియుఁ జూపించినాఁడు. ఇఁక బుద్ధునియభిప్రాయ మడుగవలెనా? ఇట్లన్ని మతములవారు కోపమును దిరస్కరించివేసిరి. ప్రేమమున కగ్రస్థానము నిచ్చిరి. ప్రేమముసఁ బదు లైనట్లు కోపమునఁ గావు.

ఒకపాఠశాలలో నొక ప్రధానోపాధ్యాయుఁడు తనసహోపాధ్యాయులను జూచి 'మీరు పాఠములచెత్త వ్రాయనిచోఁ జూడుఁడు మిమ్మేమిచేసెదనో? జీతము తగ్గించివేసెదను- బడినుండి తీసివేసెదనుగూడ!' అనియేమేమో నోటికివచ్చినట్లు ప్రేలి కోపించెడివాఁడు. ఆయనకోపమున కందఱువిసిగి యొక్కఁడును వ్రాయక వ్రాయలే దనిచెప్పెడివారు. రూల్సుప్రకార మాయనమాటాడిన వీరును రూల్సుప్రకారము మాటాడెడివారు. స్కూలుపని స్తంభించెడిది. ఇంతలో నాహెడ్‌మాష్టరుమాఱి క్రొత్తహెడ్‌మాష్టరు వచ్చెను. ఆయన తొల్లిఁటివానివలెఁ గోపికాఁడు. శాంతపురుషుఁడు. ఆయన ప్రేమముతో మాటాడెడివాఁడు. ఆయననుజూచి యందఱుసహోపాధ్యాయులు సంతుష్టులై యాయనచెప్పకుండనే తమపనులఁ జేసికొనుచు పాఠములచిత్తు వ్రాసెడివారు. కనుక ప్రేమకంటెఁ గోపము కార్యసాధన కుపకరణ మెంతమాత్రము కాదు.

అయ్యా ! కోపముకూడదంటివి. బాలుఁడు పాఠ మొప్పగింప కున్నచో? అని మీ రడుగవచ్చును. చెప్పెదవినుఁడు. అట్టి బాలునికిఁ దిన్నగాఁ జెప్పిచూడుఁడు. ఆమంచితనమును వాఁడు గ్రహింపఁడో పిదపఁగోపింపుఁడు. దాన దోషము లేదు. బాలుని మేలుకొఱకై కోపించుచుంటిరిగాని కీడుకొఱకై కాదుకదా? తల్లిదండ్రులు పిల్లల యభ్యుదయమునకుఁ గోపించిన నది దోష మగుచున్నదా? పరుల కపకారము చేయనికోపము కోపము గాదని గట్టిగా నమ్ముఁడు.

పాము-నారదుఁడు

నారదుఁడు భగవన్నామస్మరణ మొనర్చుచు నొకసర్పముకంటఁ బడెను. అది పూర్వపుణ్యమువలన నించుక జ్ఞానము కలదై యమ్మహర్షి నమస్కరించి అయ్యా ! మోక్షమెట్లులభించునో బోధింపుఁ డనిప్రార్థించెను. అందు కమ్మౌని " నీవు కోపము నడంచుకొని యెవ్వరిని గఱవక శాంతిమూర్తివై యున్నచో మోక్షము లభించు నని చెప్పి యెందేని చనియెను. నాఁటినుండి యది కోపము నడంచుకొని శాంతచిత్తమై పడియుండ బాలురు దానిని జాల మోదిరి. కట్టెలతోఁ గొట్టిరి. కాని యది బుస గొట్టదు- పడిగ విప్పదు. అది యూరకుంటఁజూచి యల్లరిపిల్లలు మఱియు మిక్కిలి దానియొడ లంతయు నజ్జునజ్జుగాఁ గొట్టి చచ్చిన దని విడిచి పోయిరి. అంత నారదుఁ డామార్గమునఁ దిరిగి

పోవుచు నాసర్పముం జూచి యే మిట్లుంటివి? వనియడుగ నప్పా ము జరిగినవృత్తాంతమంతయు నుడువ నామహాని " ఓసిపిచ్చిదా నా! శరీరరక్షణ కై ప్రయత్నింపవలదా? పరుల కపకారముచే యుట కై కోపింపకుమంటిని. శాంతము వహింపుమంటిని. కాని నిన్ను స్వదేహరక్షణ కై బుసకొట్టవల దంటినా? పరుల కపకృతి సలుపనికినుక పాపము నంటఁగట్టదు. నీవుకోపించినట్లు నటించి బుసకొట్టినచో వారు నిన్నిట్లుపీడించియుండరు. బుసకొట్టిన వారికిఁగీడు లేదు. వారికిఁగీడులేదు గనుక నీకుఁబాపము లేదు. వారు నీచెంతకురారు. నీకు వారిబాధయుండదు" అని బోధించి వెళ్లెను. సర్పము నాంటినుండి బాలుర భయ పెట్టుచు వారి కపకృతి చేయక చిత్తశాంతికల్గి కృతార్థురా లాయెను.

బాలుఁడా! కోప మెంతవారికిఁ బనికిరాదు. కోపమువలన దివ్యతపశ్శక్తి యంతరించిపోవును. కనుక నేకదా విశ్వామి త్రుఁడు కోపమువలన రాక్షసుల నిర్జింపక రాముని గొంపోయి యజ్ఞముచేసినది? దుర్వాసోముని కోపమువలనఁగదా భంగ మొందినది? అంబరీషోపాఖ్యానము కోపము కూడదని యే బోధించునది.

### అంబరీషుఁడు

అంబరీషుఁ డేకాదశీవ్రతము నిష్ఠమొయి నాచరించువాఁడు. అతం డేకాదశినాఁ డుపవాసముండి ద్వాదశినాఁడు పారణ

చేయఁబోవుచుండ దుర్వాసోముని యేతెంచెను. అమ్మహీపతి
యమ్మహర్షిని విందునకు రమ్మన నతండు వల్లెయని నదికేగి
జపముచేసికొనుచు రాక యాలస్యము చేసెను. అప్పుడు
రాజు "ద్వాదశిఘటికలు దాటినను భుజింపరాదు. అతిథిని వద
లియు భుజింపరాదు. ఇప్పుడు కర్తవ్య మేమిటి?" అని విప్రుల
నడుగ వా రుభయపక్షసమ్మతముగా నీరు పారణచేయు మన
నతం డట్లుచేసియుండ ముని యెఱింగి నన్నవమానించితి వని
కోపించి యతనిం జంపఁ గృత్యను బంపెను. అది నృపతిం జంప
రా హర్యాజ్ఞ సుదర్శన మేతెంచి యాకృత్యం జంపి మునిని
గూడఁ జంపుటకు వెన్నంటుటయు నతఁడు పర్వెత్తి త్రిమూర్తు
లను శరణు చొచ్చినను ఫలము లేమిఁ దుద కంబరీషునే శరణు
చొచ్చెను. అతండు మహాభక్తుఁ డగుట సుదర్శనమును బ్రా
ర్థించి మునిని గాపాడెను. విప్రానుమతి నీరుత్రావి ధర్మబద్ధుఁ
డై యున్న యంబరీషుని జంపఁ బ్రయత్నించు మునికోపము
నేమనవలయును? ఇంతకే యింత క్రూరశిక్షయా? అబ్బా!
కోప మెంత దూరదృష్టిరహిత మైనది? నాయనా! కోపము
వచ్చినచో వివేకము పర్వెత్తును. కోపమున కందఱు భయ
పడెదరుగదా. నీవు కోపము నడంచుకొనఁ బ్రయత్నింపుము.
కొన్ని నియమముల నేర్పఱచుకొని యభ్యసింపుము.
కోపమునకు లోఁబడఁగూడ దని ప్రతిజ్ఞ చేసికొనుము.

కోపము గల్గించు విషయములకు దూరమందుండుము.
కోపము వచ్చినపుడు మౌనము వహించియుండుము.
కోపము వచ్చినపుడు స్థానమును మార్చుకొనుము.
కోపము చల్లారువఱకు సంకెలను లెక్కించుచుండుము.
కోపము వచ్చినప్పుడు భగవద్ధ్యానము చేయుము. నీచేసినదోష ముల స్మరించుకొనుము. నీముఖము నద్దములోఁ జూచికొను ము. చల్లనినీటితో ముఖము కాలుసేతులు ప్రక్షాళింపుము. లేక చన్నీట స్నానముచేయుము. రాజసపదార్థములవలనఁ గోపము పుట్టునుగనుక నట్టిపదార్థములను భుజింపకుము. కోపము కూడ దనువాక్యము నట్టలపై వ్రాసి నీ వుండుచోట వ్రేలాడఁ గట్టుకొనుము. కోపపడఁ గూడదని పరులకు బోధింపుము. నీకుఁ గోపము కల్గినపుడు వారు గేలిచేసెద రనియేని దానినడంచుకొనఁ బ్రయత్నము సేయఁగలవు.

## 3. లోభము

బాలుఁడా! తా ననుభవింపక పరుల ననుభవింపనీయక యుంట యే లోభమునాఁబడును. అది గలవాఁడే లోభి-లుబ్ధుఁడు. పిసిని గొట్టు-పిసినారి.

"అజ్ఞానప్రభవో లోభో భూతానాం దృశ్యతే సదా" అనినట్లు పదార్థములు స్థిరంబు లనితలంచునజ్ఞానమువలన లోభము వొడముచున్నది. భారతమునందును "భూతాస్థిరత్వంబు బుద్ధిఁ

గానమి లోభ మనఘ! జనించుఁ గాంచిన నడంగు" భూతము లస్థిరము లనియెఱుంగమివలన లోభము జనించుననియు, నవి యస్థిరము లనియెఱింగిన లోభము నశించుననియుఁ గలదు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనునింద్రియములకు భోగ్యములగుపదార్థములయందు లోభము కల్గుచుండును. మఱియుఁ బదార్థోత్పత్తికి నిదానం బగుటంగావలయు ధనమునందే మానవులకు లోభము గాఢముగా నుదయించుచున్నది. కొందఱకు యశమునందును లోభ ముండుట కలదు. అది యుచితమయని కొందఱి యభిప్రాయము కాని నాకుమాత్ర మసమ్మతమే. "యశముసం దనురక్తి" యుంట సముచితముకాని లోభ ముంటకాదు.

లోభ మొకవిచిత్ర మగురోగము. అది మనంబునకు వ్రణంబు వంటి దనవచ్చును. కాదు కాదు. వ్రణము తదాశ్రయమునే నాశము చేయునుగాని యిది యట్లుకాదు. ఎచ్చటనో దూరముగానున్న సుగతులనుగూడ నాశముచేయును. లోభము వలన నిహాపరలోకముల నేమియు లాభములేదు. పైఁగా నది యంత్రమువలె దుర్గుణముల నుత్పత్తి చేయుచుండును.

శ్లో. లోభా త్క్రోధః ప్రభవతి, లోభా త్కామః ప్రజాయతే
లోభా న్మోహశ్చ నాశశ్చ లోభః పాపస్య కారణమ్.

లోభమువలనఁ గ్రోధము, కామము, మోహము, తుదకు నాశనము గూడఁ గల్గుచున్నది. పాపమునకు లోభమే కారణము.

ఒకవస్తువువిషయమై లోభపడి తత్ప్రాప్తికై సల్పుకార్యముల కంతరాయ మొదవుటతోడనే క్రోధము తలచూపును. ఆక్రోధమువలన నభీష్టవస్తుప్రాప్తి కత్యంతప్రయత్నము నాచరించును గాన(దదీయకామము ముప్పిరిగొనును. ఆయత్యంతకామమువలన ననుచితకార్యముల కేని పాల్పడునుగాన మోహపరవశత పొడమిన్నస్సే. మోహాంధుఁ డైననరుఁడు తనబలము నెదిరిబలము నెఱుఁగక యుక్తాయుక్తజ్ఞానశూన్యుఁడై రూపఱుట నిశ్చయముగదా. ఛీ! ఛీ! యెల్లపాపుల కున్కిపట్టగునిరయము లోభులకు నిలయ మనివ్రాయవలయునా ?

శ్లో. లోభేన బుద్ధి శ్చలతి, లోభో జనయతే తృషామ్
తృషార్తో దుఃఖ మాప్నోతి, పరత్రేహచ మానవః

లోభమువలన బుద్ధి చలించును. కనుకఁ దృష్ణ పొడసూపును. దానివలన నీలోకమందును బరలోకమందును నరుఁడు దుఃఖములఁ గుడుచును.

శ్లో. లోభః ప్రజ్ఞాన మాహంతి ప్రజ్ఞా హంతి హతా హ్రియమ్
హ్రీర్హతా బాధతే ధర్మమ్, ధర్మో హన్తి హతః శ్రియమ్.

లోభము బుద్ధిని నాశనముచేయును. బుద్ధి నాశనమైనందున లజ్జ లయమొందును. లజ్జ లయమైన ధర్మము నశించును. ధర్మము నశించిన సిరి తొలంగును.

ఎన్నివిధముల విచారించినను సర్వనాశనము లోభమువలననే

కలుగునని తెలుపుచున్నది. 'లోభికి మాటనష్టి' యను సామెతను వినలేదా?

### లోభి

లోభి మిక్కిలి కష్టపడి పనిచేయుచు రేవగలు ధనము నార్జించి దాని నొకబిందెలోఁ బోసి భద్రముగాఁ బాతిపెట్టి పైనే మంచము వైచికొని పరుండెడివాఁడు. ధనవ్యయభయంబున రుచ్యపదార్థముల సేకరించువాఁడు కాఁడు. తినువాఁడును గాఁడు. తినినను గడుపునిండఁ దినఁడు. అదియు నేపాసినకూరో, ఏమూఁడు చెక్కలో. పుత్రకళత్రాదులు కడుపునిండఁ దినినఁ గన్నులారఁ జూచి సహింపలేఁడు. ఎన్నఁడైనఁ గన్నకూఁతుల కేని పసుపుఁ గుంకుము పెట్టువాఁడు కాఁడు. వాఁడు చుట్టుపక్కముల నింటికిఁ జేరనీయఁడని వ్రాయవలయునా? ఎంగిలి చేతితోఁ గాకి నదలింపఁడు. తిన్న తెలెను గడిగి పాఁడిగేదెకుఁ బోసినను నోర్వలేఁడు. పొలము దున్నివచ్చిన దుక్కిటెద్దులకు సందెడుమేఁత వేసిన నంత యొందుకని రొసరొస లాడును. పెండ్లాము మొగమునఁ బెద్దబొట్టు పెట్టుకొనిన నెందు కంత కుంకుము పాడుచేసితి వనును. భుజించునపు డొక్కమెతుకైనఁ గ్రిందబడనీయఁడు. ఎట్లో పొరపాటునఁ బడినమెతుకును చీమ లాగుకొనిపోవుచుండెనా? ఇఁక దానితో ద్వంద్వ యుద్ధమునకుఁ గడంగును. కట్టుగుడ్డ నుదికినఁ జిరుఁగు ననును.

సిగ్గును గాపాడుకొనుట కెంతకొక కావలయుననును. చిరిఁగిన చివికిన మురికిపాఁతలనే కట్టుకొని తిరుగును. ఒరులు కట్టివిడిచినదానినేగాని తా నెన్నండును గ్రొత్తవస్త్రమును ధరించిన పాపమునఁ బోలేదు. కట్టుపంచెలు రెం డేటికనును. ఎన్నియని చెప్పుదును? లోభిగుణముల మీరే యూహించుకొనుఁడు.

బాలుఁడా! ఒకవేళ నిది మితవ్యయము కాదా యని ప్రశ్నించెద వేమో? కాదు నాయనా! ధనవంతుఁడయ్యు నవసరపదార్థముల సేకరించుకొన కుంటయుఁ, బొట్టనిండ తిండి యొంటినిండ గుడ్డ కలిగియుండ కుంటయు, నొరుల ననుభవింపనీయక, తా ననుభవింపక యుంటయు, లుబ్ధత్వముగాని మితత్వము కాదు. మఱిబీదవాఁ డేమిచేయఁగలఁ డనెదవేమో! బీదవాఁడైనను మట్టసముగ వాడుకొనిననే మితత్వ మగునుగాని పుత్రికళత్రాదులఁ గూడే తిననీయక తాను దినక యున్న నది పిసినారితనమే సుఁడీ.

అట్టియొకలోభికి వార్ధకమున నొకఘోరవ్యాధి సంభవించెను. వెజ్జునకు రొక్క మొసఁగవలసివచ్చునని మందు తినకపోయెను. ఆవ్యాధి క్రమముగా ముదిరి ప్రాణములఁ గొంపోవ సిద్ధముగా నుండెను. కాని లోభి తనపట్టు వీడక "చచ్చిననుసరే. మందు తినను. ఆయువులేకున్న వైద్యుఁడుమాత్ర మేమిచేయఁగలఁడు? ఆయువున్న వైద్యునితోఁ బనియేమి" అని వదరెను. అంత

గాలుసేతులు చల్లఁబడసాగెను. ప్రాణము గుటగుట లాడు చుండెను. ఆయాస మెక్కుడగుటచే మాటలాడలేకపోయెను. ఆసమయ మర్ధరాత్రిమగుట దీపము మినుకుమినుకుమని వెలుగుచుండ మరణశయ్యపై నున్నయాలోభి యెట్లోచూచి అయ్యో! ఇంతదీప మెందుకు? వత్తిని దగ్గింపుఁడనియస్పష్టముగా హీనస్వరమునఁ బలుకుచు సన్నసేసి విస్మృతిచెందెను. మరలఁ గొంతసేపటికి స్మృతివచ్చెను. మరల విస్మృతివచ్చెను. కాని ప్రాణ మెంతసేపటికిఁ బోవదు. అప్పు డింగితాకారవేదినియు ననుభవజ్ఞురాలును నగునొకముదుసలి ముందుకు వచ్చి "అట్లుచూచెద రేమి? ఆధనమునుగడిగి యాజలము తెచ్చి యుద్ధరణెఁడు గొంతులోఁబోసి నీధనమును మేమంటుకొన మనుఁడు. ప్రాణములు పోవు"నన వారట్లుచేసిరి. ఆలోభి మరణవేదనమునుండి విముక్తుఁడై శరీరము విడిచిపోయెను. చూచితివా! లోభి ప్రాణముకంటె ధనమునే మిక్కిలి ప్రేమించును. తనువుఁ దొఱఁగినపిదప ధన మేలనో?

ఒజ్జ పాఠము చెప్పుచుండఁ గొందఱు విద్యార్థులు తమపొత్తములన్యులఁ జూడనీయరు. అంటనీయరు. ఎక్కడరా చదువుచున్నదని యొకసోమరి యడిగిన వ్రేల్పెట్టిచూపినఁ బొత్తము మాసిపోవునని విన్పించుకొనరు. తమపుస్తకములఁ దెఱచిన విఱిగిపోవునని యెఱవిప్పియే పఠింప దొరకొందురు. భద్రముగా వాడుకొనుట మంచిదేకాని పిల్లికి బిచ్చమువెట్టని చేతలు మాత్రము కూడవనియే నేనుచెప్పునది.

అర్థాదులు వ్రాసికొనినపుస్తక మిమ్ము-నేనువ్రాసికొని యిచ్చెదనని సహవిద్యార్థి యడిగిన నేమటిగిపోవునని యో మూతి విఱుచును. ఇంచుక యవ్వలికి జరుగుము-నేనును నీబల్లమీఁదఁ గూర్చుండెద ననిన నింతయేని చోటుపెట్టఁడు. ధూమశకటాదుల ముందున్నవారు వెనుకవచ్చువారిని జేరనీయక పోవుటను జూచుచుంటిమిగదా? ఎందులకో యింతలుబ్ధత ?

పిసినారితనమువలన సుఖమబ్బునా? యనిన నదియు లేదు. లోభికెప్పుడు వ్యయమగునని యేకదా దుఃఖము? చెట్టు గొట్టి పైకి నెట్టుకొన్నట్లు దీని నేల మానవులు పైకి నెట్టుకొనెదరో ?

"అస్థిరత్వం చ భోగానాం దృష్ట్వా జ్ఞాత్వా నివర్తతే"

భోగముల యస్థిరత్వమును జూచి తెలిసికొనినయెడల లోభము నశించును. "అశాశ్వతము లైనవస్తువుల శాశ్వతముగా నుంచుకొనఁ బూనుటకుఁ దాను జిరంజీవియై యుండునా? " అని తలపోయుచున్న లోభము దూరముగాఁ బర్వెత్తును. 'పరలోకముల సుఖపడుట కే నిప్పు డెట్టిపనులఁ జేయుచుంటి? ' నని విచారించుకొనుచున్న లోభము చెంతకుఁ జేరదు. ఇంద్రియసుఖములకై మనంబును జొరనీయక వానినుండి తొలఁగించుచున్నచో లోభము నశించును. తలంపులఁ దొలంగిన లోభము విలయమొందును. "త్యాగాయ సంభృతార్థానామ్" అనినట్లు ధనధాన్యాదులఁ గూర్చుకొనుట దానముచేయుటకేసుమీ!

అని నీవు తెలిసికొనిన లోభము పరాభవ మొందును. నీకన
వసర మైనపదార్థములఁ గూడఁబెట్టుకొనఁ బ్రియత్నింపకున్నను
లోభ ముపశమించును.

## ౪. గర్వము.

బాలుఁడా ! గర్వమునుగూర్చి వ్రాయుచున్నాఁడను. దానిని
జదివికొని యాదుర్గుణపిశాచమును జేరనీయకుము.

గర్వము-అభిమానము-అహంకారము-మదము-అనుపదములు
వాడుకలో సమానార్థకములుగా నున్నవి. ఈగర్వము బలము
వలనఁగాని యైశ్వర్యమువలనఁగాని, వంశమువలనఁగాని, సౌం
దర్యమువలనఁగాని, విద్యాదులవలనఁగాని, పొడముచున్నది.
దుర్జనుఁ డీబలాదులవలన నన్యుల ధిక్కరించి ' నాకంటెగొప్ప
వాఁడు లేఁడు. నేనే మొనగాడ'నని పరుల నిందించుచుఁ
ద న్నభినందించుకొనుచు నుండును.

కం. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియె తెచ్చు నుర్వీనాథా !

ధనము-విద్య- కులము- ఇవి దుర్జనులకు మదము గలిగించును.
సజ్జనులకు శారీరకమానసికనమ్రతను గలిగించును.

పదియకరములు గలవానికి గర్వమే. నూఱుయకరములు
గలవానికి గర్వమే. వేయియకరములు గలవానికి గర్వమే.

అరరే ? లక్షాధికారి నేనే గొప్పధనవంతుఁడ ననును. కోటీ శ్వరుఁడు నేనే గొప్పధనికుఁడ ననుకొనును. రాజు నేనే గొప్ప ధని ననుకొనును. చక్రవర్తియు నేనే గొప్పధని ననుకొనును. 'తా నెక్కువాఁడున్నఁ దలఁ దన్నువాఁ డుండు' ననుకొనక పోవుటవలననే యిన్ని గర్వములు తలచూపుచున్నవి.

ఉ. అంచితబుద్ధులైనమనుజాధిపతుల్ జగమెల్లఁ దొల్లి ని
ర్మించిరి, దానిఁ గొందఱు భరించిరి, యిచ్చిరి కొంద ఱర్థికిన్
మించి జగంబు లన్నియును నెమ్మి భుజించుచుఁ గొందఱుండఁగా
బంచపట్టణేశుల కపార మదజ్వరమింత యేటికిన్ ?

తొల్లి మహామేధావు లగుప్రజాపతు లీజగమునంతయు సృజిం రిచి. పిదప మన్వాదులు దీనిని బాలించిరి. అవ్వల మఱికొం దఱు పరశురామాదులు దీనిని జయించి యొరులకు దానము చేసిరి. ఇంక నిప్పుడు బలిచక్రవర్తిప్రభృతులు కొంద ఱీ పదునాలుగులోకములను బాలించుచుండ నైదాఱుపట్టణము లకుమాత్రి మధీశులగు కొందఱుమనుజుల కింతగర్వ మేటికో?

చ. ఎడ నిముసంబులేక ధరణీకళతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ పొందునె రాజులకీ నేలతున్కలో
నడరులవంబులోఁ దునియయుం దొకమూలకు నాథులైనవా
రడలక వైపరీత్యమున హర్షము చెందుదు రెంతమందులో!

ఒకనిముసమైన నెడములేకుండ నెప్పుడు నెందఱో యీభూమి ననుభవించుచునే యుందురు. అట్లు భుజించి వదలిపెట్టఁబడిన

యీభూమి లభించుటతోడనే రాజుల కేమిగౌరవము లభిం చునో? ఉచ్ఛిష్టభోజనము గౌరవప్రదమా? అదియుఁగాక యెంతభూమిని వీ రనుభవించునది? భూమండలమందలి యొక ఖండములోని యొక కొంచెము భాగమునందలి యొకగడ్డలో నొకమూలనుమాత్రమే. ఈకొలఁదిదానికిఁ బ్రభువులై కొం చెమే యని యేడ్చుటకుబదులు మురిసిపోయెదరు. వీరి మూర్ఖత నేమనవలయును ? ఈమాత్రపు జిట్టెఁడునేలకే యెంతోగర్వముగదా !

ప్రజ్ఞాశాలి యగుబృహస్పతి వక్త. వేయికన్నుల విద్యార్థి పతిత. వారి కాయువా అపరిమితము. అట్లయినను శబ్దశాస్త్రము వారికి సాంతము కాలేదఁట. ఈకించిత్ జ్ఞుఁ, డీమందుఁ, డీయల్పా యుష్కుఁ డగునరుఁడా శబ్దశాస్త్రనిష్ణాత ? పండిత బ్రువుఁడు !

ఆంధ్రము నేర్చిన సంస్కృతము రాదు. సంస్కృతము చదివిన నాంధ్రము రాదు. రెండు నభ్యసించిన మఱొక భాష రాదు. ఇన్ని భాషలు నేర్చినను సర్వశాస్త్రములయందు జ్ఞాన ముండదు. ఒకవేళ నన్ని భాషలయందు సకలశాస్త్రజ్ఞాన మలవడినను గవిత్వ మంటదు. అది యంటిన వక్తృత్వము పూజ్యము. అది యున్న రచనాశక్తి సున్న. ఇవి యన్నియునున్న సర్వ కళలసామర్థ్య ముండుననుట కేమాధారము ? కట్టా ! మాన

వుఁడు సర్వజ్ఞుఁడా! 'నేను గొప్పపండితుఁడను. నన్ను మించినవాఁడు లేఁ'డనుటా! "అల్పవిద్యాంసుండు నాత్మేవణకుఁ బెద్ద" యనుట నిక్కమయ్యా.

ఒక్కఁ డొక్కశాస్త్రముం దుదిముట్టఁ జదువ వానియాయువు చాలదుగదా! అట్టిచో నన్నిశాస్త్రముల 'నితిశ్రీ' వఱకుఁ జదువ నెవ్వరికిఁదరము? అట్లుచదువక నాకంటె నధికుఁడు లేఁడనుట యేమిధర్మము?

మానవుఁడు 'నే నీపంచభూతములఁ లోఁబఱచుకొంటిని. ఈవిశ్వ మంతయు నాదే. నాసుఖముకొఱకే యీసమస్త వస్తువులు నేర్పడిన'వని పొంగి పోవును. బాపురే! అనంతమైన యీవిశ్వమున నరుఁ డొకపరమాణువును బోలునో పోలఁడో? ఒకవేళఁ బోలినను దాను గూపస్థమండూకమువలె నొకచోటనుండి విశ్వము ప్రాదేశమాత్రపరిమిత మనితలంచెఁగాబోలు! దానిని లోఁబఱచుకొంటి నని బొమ్మవిఱుచుచున్నాఁడు.

ఎంతవిచిత్రము. నిన్నటిసిద్ధాంతములు నేఁడు త్రోసివేయఁబఱుచున్నవి. నేఁటిసిద్ధాంతములు ఱేపు త్రోసివేయఁబడకుండునా? కొంతకాలము భూమి కాదు తిరుగునది, సూర్యుఁడనిరి. కొంతకాలము సూర్యుఁడు కాదు తిరుగునది, భూమి యనిరి. కొంతకాలము దయ్యములు లేవనిరి. కొంతకాల మున్న

వనిరి. కొంతకాలము వృక్షజాతులకు సుఖదుఃఖములు లేవని తలంచిరి. కొంతకాల మున్నవని తలంచిరి. కొంతకాలము జంతువులకు భాష యున్నదనియెంచిరి. కొంతకాలము లేదని యెంచిరి. కొంతకాలము శిలాదులకుఁ బ్రాణ మున్నదని గ్రహించిరి. నేఁడు లేదని పలుకుచుండిరి. ఇక నేమని నిర్ధారణ చేసెదరో తెలియదు. ఈమిడిమిడిజ్ఞానమునకా గర్వము? తా నెఱుంగనివిషయము లెన్ని లేవు. ఒక్కవిషయమును గనిపెట్టి గర్వించుటా?

నరుఁడు తాను దేనిని జూచి పొంగిపోవునది? పాండిత్యమును జూచియా? వక్తృత్వమును జూచియా? ధనమును జూచియా? బలమును జూచియా? పోనీ వీనినైనఁ దాను సమగ్రముగాఁ గల్గియున్నాఁడా? కల్గియున్నను దనకంటె మఱొకఁడు మిన్న లేఁడని తా నెట్లుచెప్పఁగలఁడు?

'నేను బలవంతుఁడను. నేను 'శాండో'ను. నారెట్టఁ జూడు మెంతలావో! నావక్షఃస్థలముఁ జూడు మెంతవెడల్పో' యని కొందఱు గర్వోక్తు లాడుచుందురు. వీఁ డెంత? వీని బల మెంత? సృష్టభూతములలో వీనిని మించినభూతము లేదా?

తా నేనుఁగుతోఁ 'గుస్తీ' పట్టఁగలఁడా? వటవృక్షముఁ బెఱుకఁగలఁడా? కొండను దొర్లింపఁగలఁడా? పూర్వము కోఁతులే కొండల నెత్తికొని యాకసమునఁ బర్వెత్తెనన్న

నమ్మలేని దుర్బలస్థితిలో నున్న మానవుఁడు నేను బలిష్ఠుఁడనని చెప్పుకొనుటకు సిగ్గుపడఁడుగదా?

పోని మ్మాబలము నెంతకాలము దాను నిల్పుకొనఁగలఁడు? క్షణభంగుర మ్మైనబలమున కింతమిట్టిపా టేల?

ఉ. బాలకుఁడై క్షణంబు యువభావయుతుండయి కొంతకాల, ము
ద్వేలదరిద్రుఁడై క్షణము, విత్తసమన్వితుఁడై క్షణంబు, జీ
ర్ణాలసగాత్రుఁడై నటునియట్లు నటించి, తుదిన్ నరుండు యా
మ్యాలయనామ మైనతెరయందుఁ జొరంబడు సత్వరంబుగన్

ఈసంసార మనుకపటనాటకమందు మనుజుఁ డనువర్తకుఁడు క్షణకాలము పిల్లవాఁడుగను క్షణకాలము యువకుఁడుగను, క్షణము దరిద్రుఁడుగను, క్షణము ధనవంతుఁడుగను, క్షణము మూఁడుకాళ్ల ముసలివాఁడుగను, నటించి తుట్టతుదకు మరణ మనుతెరమఱుఁగున కరుగును. ఇందులకా గర్వము? ధనుర్ధరశేఖరుఁడ ననిగర్వించినయర్జునుఁడు తనవిల్లగుగాండీవమునే యొకప్పుడు మోయలేకపోయెను. దొంగలచే దెబ్బలు తినెను. బాహుబలము కలవాఁడనని యుబ్బెడిభీముఁ డొక్క పాముచేతఁ బట్టువడి విడిపించుకొనలేకపోయెను. దేవతాప్రార్థనమున నింద్రపదవి నధిష్ఠించిననహుషుఁడు గర్వాంధ్యమునఁ గన్నుగానక యగస్త్యశాపమునొంది సర్పరూపుఁడై పిదపఁ దెలివొంది చూడు మెట్లుదుఃఖించుచున్నాఁడో!

చ. చదివితి నెల్లవేదములు, సత్క్రియఁజేసితి నూఱుయజ్ఞముల్
విదితముగా సురేంద్రపదవిస్థితిఁబొందితి, దుర్మదంబునన్
దుదిఁ బెనుఁబాము నై యధికదుఃఖుఁడ నైతి, సుఖంబు దుఃఖము
న్వదలక చేయుచోట బలవద్విధి కేమిభరంబు సెప్పుమా!

ఎన్ని వేదములఁ జదివిన నేమి ? ఎన్ని యజ్ఞములఁ జేసిన నేమి ? ఎంతయిందుఁడైన నేమి ? మదించినచో నెవఁడైన నణఁగారి పోవవలసినదే.

కొందఱు మేము గొప్పకులమున జనించితిమని గర్వింతురు. ఈగర్వావగుణ మున్నంతవఱకు వారు కులీనులు గారు. చండాలురే. గుణము చండాలుఁడైనను గొదవగాని కులము చండాలుఁడైనను గొదవలేదు' తాను సత్కులీనుఁడైన మాత్రమున నెవరికే మొఱఁగినది ? పూర్వసుకృతవశమున నాముప్యాయణుఁడనైతినని తలంచి వినయపరుఁడై యింకొధిక ముగా సత్కార్యము లాచరింపవలయునుగాని మిట్టిపడిన నేమి లాభము ? మంచిగుణము లున్నచో మాలవాఁడైనను గులీను నితోఁ దుల్యుఁడే. ఎఱుకలవాఁడైనధర్మవ్యాధుఁడే యొక బ్రాహ్మణునకు బుద్ధిగఱపవలసివచ్చినదిగదా!

కొందఱు మే ముద్యోగవంతులబిడ్డలమని యహంభావము చూపుదురు. " అధికారాంతమునందుఁ జూడవలెరా యాయ య్యైసౌభాగ్యముల్ " అనుట వీ రెఱుఁగరుగాబోలు! ఉద్యోగ

మున్నందుకుఁ జేతనైనసాయ మొరులకుఁ జేయవలయునుగాని పరుల నధిక్షేపించుట భావ్యముగాదు.

కొందఱు మాతరగతిలో మే మెక్కుడుగుణముల సంపాదించి యెల్లప్పుడు ప్రథములముగానే యుందుమని యభిమానవంతు లయ్యెదరు. తెలివిగలవాఁ డగుటయు నెక్కుడుగుణముల సంపాదింపఁ బ్రయత్నించుటయు లగ్గే కాని గర్వించుటమాత్ర మెగ్గుసుమీ.

కుఠారధార మృదులతనువలె గర్వ మభ్యుదయమును ద్రుంచి యధఃపాత మొనరించును. నే నింతవాఁడనైతినని యేనిముస మునఁ దలంచునో యానిముసమే వానివినాశమునకుఁ బ్రారంభ కాలము. తమబిడ్డలఁ దల్లిదండ్రు లెట్టయెదుట మెచ్చుకొనని దిందువలననే.

> కం. తను లోకము కొనియాడఁగ
> విని యుబ్బఁడు సజ్జనుండు. వెండియుఁ గడు మే
> లొనరించుఁ గీడొకించుక
> యును దనదెసఁ దోపనీక యుడుపుచువచ్చున్.

తనపొగడ్తకు సజ్జనుఁ డుబ్బఁడు గాని దుర్జనుఁ డుబ్బును. నాఁటినుండియే చెడిపోవ మొదలుపెట్టును. పాప మప్పుడు వానికిఁ గన్నుమిన్ను గన్పడదు.

గర్వాంధుఁడు తనభావిదుర్దశలఁ జూడలేఁడు. కర్తవ్యములఁ జేయఁబోఁడు. హితులబోధ నాలకింపఁడు. పరులశక్తిని దన

శక్తిని బరికింపఁడు. సీతాకోకచిలుకవలెఁ దనమార్పునే తాను గ్రహింపనేరఁడు.

అవలిప్తుఁ డెల్లపుడు పరదోషములనే పరికించుచుండును. పరులనే యవహేలనము చేయుచుండును. తన్నుఁ దాను గౌరవించుకొనుచుండును. తనతో సమానముగా నొరులకు సమ్మానాదులు జరుగుట కిచ్ఛగింపఁడు.

ఇట్టిగుణమువలననే బ్రహ్మేంద్రాదులు కృష్ణునిచే భంగపడిరి. ఏదోయొకవిధమైన శక్తిలేశము తమ కౌదవుటతోడనే గర్వించి దాని సంపూర్ణఫలమును బొందలేకపోవుట యెల్లలోకములందును గన్పించుచున్నది.

అగ్న్యాదులు

పూర్వము దేవాసురసంగ్రామమున బ్రహ్మము దేవతలకే విజయము గలిగించి వారివారికిఁ గొన్నిశక్తుల ననుగ్రహించెను. పిదప నాదేవతలు తమదే యీజయమనియుఁ దమవే యీశక్తులనియు నెంచి బ్రహ్మశక్తిని మఱచి గర్వించియుండ నా బ్రహ్మము వారివృథాహంకారము నడంచుట కొకయద్భుతరూపము ధరించి వారిని సమీపించెను. దేవత లీతఁ డెవ్వఁడో తెలిసికొనిరమ్మని యగ్నిని బంపిరి. అతఁ డేగి యాభూతము వలన నీవెవఁడవని ప్రశ్నింపఁబడి 'నేను జాతవేదుఁడను. భూమిలోనిసమస్తవస్తువుల దగ్ధముచేయుశక్తి నాకుఁ గల

దనెను. అప్పు డాభూత మొకతృణమును బడవైచి దీనిని భస్మముచేయు మన నతం డెట్లును భస్మముచేయఁజాలక వెనుకకుఁ దిరిగి పర్వ్తి దేవతలతో నతం డెవండో యెఱుఁగనని పలికెను.

అంత వాయుదేవుని వా రంపిరి. అతం డేగి సంప్రుష్టుఁడై 'నేను మాతరిశ్వుఁడను. పృథివియందలిసర్వపదార్థముల సంగ్రహింపఁగల'నన నాభూతం బొకతృణమువైచి దీనిని గదలింపుమన నతం డెన్నివిధములనో ప్రయత్నించి దానిని గదలింపనేరక దేవతల కడకుఁ బాఱివచ్చి యతం డెవ్వఁడో నే నెఱుంగ ననియెను. అంత దేవత లింద్రు నంపిరి. అతం డేగ నాభూత మంతర్హిత మైపోయెను. అప్పు డింద్రుఁ డుమాదేవి నాకసంబునఁ గాంచి యంతర్హితమహాపురుషుం డెవ్వఁడని యడుగ నామె యిట్లనియె.

'ఆయన మీకు విజయము సమకూర్చి కొన్ని శక్తుల మీకిచ్చిన మహాపురుషుఁడు. దేవదేవుఁడు. పరంధాముఁడు. అది మీరు గ్రహింపనేరక స్వశక్తివలననే జయించితిమనియు మహిమాన్వితుల మైతిమనియు గర్వించుచుంటిరి. అందువలన మీ గర్వ మడంచుట కాయన దర్శనమిచ్చి తిరోహితుఁడయ్యె' ననెను. అంత నింద్రాదులు నిర్గతాహంకారులైరి. దైవశక్తి లేనియెడల నెవ్వరు నేపనియుఁ జేయఁజాలరు. కనుక నాయనా! గర్వ మెట్టివారికిని గూడదు.

### పాండవులు

బాలుఁడా! పాండవులస్వర్గారోహణవృత్తాంతమును వినలేదా? మహాప్రస్థానంబున వారు భూప్రదక్షిణము చేసి యుత్తరముగా నేగుచుండఁ దమ్ములు పడిపోయినపుడు ధర్మరాజం డిట్లనియె. "తనతో సమానుఁ డగుప్రజ్ఞావంతుఁడు లేఁడనితలంచుదోషము వలన సహదేవుఁడు పడిపోయెను. సౌందర్యమున నాతో సమానుఁడు లేఁడు; నేనే రూపవంతుఁడ ననితలంచుటవలన నకులుఁడు పడిపోయెను. ధనుర్ధరులలో నాకంటె నధికుఁడు లేఁడు. నే నొక్కదినముననే శత్రువుల వధింతు ననిపలికి యట్లు చేయఁజాలకపోవుటవలన నర్జునుఁడు కూలిపోయెను. నాకంటె బలిష్ఠుఁడు మఱొకఁడు లేఁడని యాత్మశ్లాఘాపరాయణుఁడై నదోషమున భీముఁడు గతించెను."

నిరహంకారుఁ డగుధర్మరాజుఁడుమాత్రము భూమిం డ్రెళ్ళక స్వర్గమున కేగెను. నాయనా! ఎవ్వరికి నహంకారము పనికి రాదు. ఒకవేళఁ దనయందే దేని విశేషమున్న నది భగవద్దత్తమనితలంచి యత్యంతము వినీతుఁడై యుండవలయునుగాని గర్వింపరాదు.

గర్వ మల్పులకే యుండునది.

చ. తెలివి యొకింతలేనియెడఁ దృప్తుఁడనై కరిభంగి సర్వముం
తెలిసితినంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి, యిప్పు డు

జ్ఞ్వలమతులై నపండితులసన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితిన్. గతమయ్యె నితాంతగర్వమున్.

అనిభర్తృహరి వాకొనియెను. ఇదివఱకు తెలివి యించుకంతైన లేనపుడు 'సర్వమును దెలిసికొంటిని. ఇఁక నే నెఱుఁగవలసిన దేమియు లేదని యేనుఁగువలె గర్వించి సంచరించితిని. పిదపఁ బండితుల సాన్నిధ్యమున నేదో కొంత తెలిసికొని, 'యిదివఱకుఁ దలంచినది పొరపాటు నే నెఱుంగవలసినది కావలసినంత గలదు ఇసీ! నే నవివేకినిసుమా'అని యిప్పుడు తలంచుచుంటిని. గర్వ మంతయు నశించినది.' ఇం దెంతయేని సత్యము కలదుగదా! తెలిసికొనవలసిన దున్నదని తెలిసికొనుటయే తెలివి.

సంగతు లున్నవని తెలిసినఁగదా యాసంగతులఁ దెలిసికొనఁ బ్రయత్నించునది? తెలియనిసంగతు లున్నవని యెంచునది? సంగతు లున్నవనియే యెఱుంగనప్పు డిఁక వాఁ డెఱుఁగ వలసినసంగతు లున్నవని యెట్లుతలంచును? కనుక 'నేను సర్వముం దెలిసితి' ననుకొనును. కనుక బాలుఁడా! గర్వపర్వ తముఁ దెలివి యనుకులిశమునఁ జెండివేయుము.

అష్టమాధ్యాయము—సమాప్తము

# ఉపసంహారము

## సత్సహవాసము

శ్రీమంతుఁడా ! నీవు మంచివారితోడనే స్నేహముచేయుము. వారిస్నేహమువలన నీకు లభించులగ్గులకుఁ బారము లేదు. ఐహికాముష్మికైక ప్రయోజనములఁ గల్గించునది మంచివారి నెయ్యమేసుమీ.

ఎప్పుడేని కోపపరవశుండవై వాగ్రూపమునఁగాని కార్యరూపమునఁగాని చివఱ కాలోచనారూపమునంగాని యొరుల కపకారముం జేయంబూనిన నిన్ను వా రాపాపమునుండి తొలఁగించి రక్షింతురు.

సోమరితనమునంగాని, నిర్లక్ష్యమునంగాని, నీవిధుల నీవు నిర్వర్తించుకొనక యుపేక్షించినచో నీబుద్ధిమాంద్యము నడంచి నీ కుత్సాహముఁగల్గించి యుక్తకార్యములం బ్రవిష్టునిం జేసెదరు. కోపము రూపుమాపెదరు. చింతాకంటకము గెంటివేసెదరు. ఆనందముం బెంపొందించెదరు.

నీసన్మిత్రులు గేలిసేయుదు రనియేని బొంక జంకెదవు. కులధర్మముఁ దొలంగం గలంగెదవు. ఆచారము బుగ్గిసేయ సిగ్గ సెందెదవు.

నాయనా! మనస్సు చుక్కానిలేని యోడవంటిది. ఎటుమలపిన నటు పోవును. పట్టు వీడినఁ దనయిష్టమువచ్చినట్లు పోవుచుం డును. కావున దానిని మంచిత్రోవలో నుంచుకొనుట కొక సాధనము సత్సహవాసధనము.

సత్సాంగత్యంబున హృదయంబు నిర్మలంబై నిరంతర మానం దరసంబున నోలలాడు చుండును. మనోనైర్మల్యముకొఱకై కదా-తపములు-జపములు-ఉపవాసములు-వ్రతములు విధింపంబడుట.

గీ. సుదతి, యేటికి నంతశ్శుద్ధిలేని
బాహ్యసంశుద్ధి? బహుతీర్థపరిచయమున
వేయికడవలజలముల వెలిఁ గడిగినఁ
గలుగునే శుద్ధి? వారుణీకలశమునకు.

లోనఁ గల్లు గలకుండను వెలుపల నెన్నికడవలనీళ్లు పోసి కడిగినను బరిశుద్ధమైనదగునా? అట్లే నీవు శరీరశుద్ధి చేసి కొనిననే చాలదు. అంతశ్శుద్ధియు నత్యంతావశ్యకము సుమీ.

అంతశ్శుద్ధివలన ముఖవికాసము హెచ్చగును. ఆరోగ్యము కుదురుకొనును. ఆనందము కందళించును. కనుక నీ వంతశ్శుద్ధి నలవరించుకొనుటకు సన్మిత్రముల నేర్చికొనుము.

వారిచెలిమివలన నొకప్పుడు త్రాగుడు మొదలగుదుర్వ్యసనముల కలవాటుపడిన నీమనస్సును మరల్చికొనఁ గల్గుదువు. వారిని దెలిసికొను టెట్లందువా? వినుము.

సజ్జను లతిసూక్ష్మదృష్టితో మిక్కిలి నైపుణ్యముతోఁ బరికించి నంగాని గోచరింపరు. 'పాము కాళ్ళు పామే యెఱుఁగు'నన్నట్లు సజ్జనులే గుర్తింపఁగలరు. ఏలయన, వారిపనులే వేఱు. వారి యునికియే వేఱు. వారిలోకమే వేఱు. అయినను, నీవు బుద్ధిమంతుఁడవే యయినచో వారే నిన్ను వెదకుకొనుచు వచ్చెదరుసుమా!

వారు తమవని యేమో తామేమో కాని పరులజోలికిఁ బోరు. ఎదుట నొకటి చెప్పి యావల మఱొకటి చెప్పరు. పరోక్షాపరోక్షముల వారికిఁ ద్రికరణశుద్ధియేకాని, ముఖస్తుతులు-మొగముచాటునఁ బరిహాసములు వారెఱుంగరు.

పరుల సుగుణములనే పరికించి ప్రస్తుతింతురుగాని యవగుణములనే యవలోకించి యందఱకుం జాటరు. జను లందఱుఁ గలఁతఁ బొందుపని చేసి యొరులచే వ్రేల్వెట్టి చూపింపఁబడరు.

ఎవఁడు తనచెలికానికి సంపదాపదలయందుఁ దోడునీడయై క్షీరనీరన్యాయంబున నుండునో, ఎవఁడు దైవికముగా నొకనాఁడు దుర్జనులలో మెలఁగవలసివచ్చినను దిలతండులన్యాయమునఁ బ్రవర్తించునో - అట్టివాఁడు సజ్జనుఁడు.

తనప్రాణాపాయస్థితి తొలఁగునన్నను, దనకుం బదివేలొరగునన్నను న్యాయేతరవృత్తి నవలంబించి యకార్యముల నాచరింపనివాఁడే సజ్జనుఁడు.

మ. పాసఁగన్ దానము గుప్తమర్థిభవనంబుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థానవిధానమున్ బ్రియవిధుల్ గావించి మౌనంబు రా
జసభన్ మిత్రకృతప్రకాశనము సత్కారకర్మవైముఖ్య మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో!

పరులచేఁ బ్రశంసింపంబడుటకుంగాక రహస్యముగనే దానము చేయుచుండును. తనగృహమునకు యాచకుఁ డరుదెంచెనేని సంతోషముతో నభ్యుత్థానాదికముచే నాదరించుంగాని 'వీఁడేల వచ్చె' నని రోయఁడు. తా నొరుల కేదేని యుపకారము నాచరించి యూరకుండుంగాని 'నే నిదిచేసితి-నది చేసితి' నని యాత్మశ్లాఘాపరాయణుఁడు కాఁడు. పరులే తనకు మేలుచేసినఁ గృతజ్ఞుఁడై వారిం బండితపామరులు గల సభలలోఁ బ్రశంసించుచుఁ బదుగుర కెఱుకచేయుం గాని మూకీభావము వహించి వారల మొఱంగఁడు. జనులు నిందించు చెడ్డపనుల నెన్నండేని యాచరింపఁడు. ఆహా! కత్తిపదనుపై నడచుటవంటి యిట్టిప్రవర్తనము గలవాఁడే సజ్జనుఁడు. అది వానికి సుకరమే కాని తదితరులకు దుష్కరము సుమా.

తాను బరులఁ బొగడునుగాని పరులు తనను బొగడిన సహింపఁడు. తాను బరులదోషమును క్షమించునుగాని తనదోషమును దాను క్షమింపఁడు. పరులసౌఖ్యమునకై తాఁ గష్టపడునుగాని తనసౌఖ్యమునకై పరులఁ గష్టపెట్టఁడు.

తనసంపద లర్థిజనవినియోగంబునఁ దఱుఁగకపోయెనే యని తలపోయుంగాని పరులధనము తఱుఁగకపోయెనే యని తల పోయఁడు.

పరుల యౌన్నత్యమునకుంబోలెఁ దనహైన్యమునకు సంతసించును. అన్యుల యదృష్టమునకువలెఁ దనదురదృష్టమునకు నుల్లసిల్లును.

బిడ్డా! ఇట్టివాఁడు సజ్జనుఁడు. వానిం గులముం జూచికాని, రూపమును జూచికాని, గ్రహింపలేవు. అధమజాతులలో నేని యనాకారులలో నేని సజ్జనుఁ డుండును.

సజ్జను నెఱుంగుట గుణమునుబట్టియే కాని కులమునుబట్టి కాదు. చర్యలంబట్టియే కాని చదువుంబట్టి కాదు. ఆంతర్య ముంబట్టియే కాని యైశ్వర్యముంబట్టి కాదు.

సజ్జనుని వెదకుట యెంతకష్టమో వానితో మైత్రిచేయుటయు నంతకష్టమే. ఏలయన వాఁడు సజ్జనునితోడనే కాని దుర్జను నితో మైత్రిచేయఁడుకదా? కనుకఁ బ్రప్రథమమున మీా యొండొరులకు సులభముగా స్నేహము కుదురదు. కతిప యదినంబులకుంగాని మీా హృదయములు బయల్పడినంగాని చెలిమి కలుగనేరదు. సజ్జనులచెలిమి బంగరుచెంబువంటిది. దుర్జనులచెలిమి మంటికుండవంటిది. సజ్జనులచెలిమి కలియుట

యెంతకష్టమో విడిపోవుటయు నంతకష్టమే. దుర్జనులమైత్రి కుదురుటయుఁ బ్రిదులుటయు సులభము. కనుకనే

గీ. మొదలఁ జూచినఁ గడుఁగొప్ప పిదపఁ గుఱుచ
ఆది కొంచెము తర్వాత నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగజనిత మైన
ఛాయపోలికఁ గుజనసజ్జనులమైత్రి.

సూర్యోదయకాలమున మిగులఁ బొడవుగా నున్ననీడలు క్రమక్రమముగాఁ దఱుఁగుచు మధ్యాహ్నకాలమునకు మాయమయి పోవునట్లు, కుజనస్నేహ మాదియందు మిక్కిలి యెక్కువగానుండి కాలక్రమమునఁ దఱుఁగుచుఁ దుదకు నశించిపోవుననియు, నపరాహ్ణమునుండి నీడలు పొడసూపి కాలక్రమమునఁ బెరుఁగుచు సూర్యాస్తమయ సమయమునకు మిక్కిలి యెక్కుడగుచందమున సజ్జనుల చెలికార మాదియందుఁ గొంచెముగానుండి క్రమక్రమముగాఁ బెరుఁగుచు నుండుననియు నెఱుంగుము. అట్లగుటకు దుష్టులలోని స్వార్థపరత్వమును శిష్టులలోని స్వార్థత్యాగమును గారణంబు లని జ్ఞప్తియుంచుకొనుము.

బిడ్డా! జడంబులంజూచియేని యెడంద సన్మైత్రికిం గడంగుము. చూడుము.

ఉ. క్షీరము మున్ను నీటికొసఁగెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరము తప్తమౌటఁ గని చిచ్చుతికెన్ వెతచే జలంబు ; దు

ర్వారము వహ్నిదీప్తిఁ గని వహ్నిఁ జొరంజను దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంత మగు; నిల్చు మహాత్ముల మైత్రి యీగతిన్.

పాలు తనతోడంగూడిన తోడుఁబాలకుం దనగుణముల నిచ్చును. అవ్వలఁ బాలను గాఁగఁబెట్టుదుముగదా. ఆపాల యుత్తాపముం జూచి నీరు నిప్పులోఁ బడును. తనమిత్రు మగు జలం బనలంబునం బడుటను జూచి క్షీరము తానుగూడ నిప్పులోఁ బడఁబోవును. పాలపొం గాఁగుటకు మనము నీరు చల్లుదుముగదా. అట్లు నీరు మరలఁదనతోఁ గూడఁగనే యది శాంతించి తనమిత్రుము తనకు లభించె నని సంతసించు చున్నది. సజ్జనమైత్రి యిట్లే యుండునది.
పది యిచ్చియైనఁ బాదుచెల్మిం బాచికొనుము. శతమిచ్చియైన సన్మైత్రిని సంపాదించుకొనుము.

### కళావతి

పూర్వము హరిభక్తుఁడగునొకవిప్రునింట కళావతి యను నొక దాసి యుండెడిది. దాని కొకకుమారుఁడు జన్మించెను. వాఁ డాపారునింటనే పెరుగుచుంటచే నతనికి శమదమాదులు పట్టువడియె. మఱియు నిరంతర మాద్విజుండు హరినామస్మరణము చేయుచుండఁగా వినువాఁ డగుటచే వానికిని హరిభక్తి కుదిరెను. ఆదాసీపుత్రుఁ డిట్లు బ్రాహ్మణస్నేహంబున నీశ్వరభక్తియు విజ్ఞానంబును నార్జించె. కొండొకనాఁ డవ్వారునింటికి ముగ్గురు యోగులు రాఁగా నాదాసీపుత్రుఁడు

భక్తిశ్రద్ధలతో వారిని సేవించుచు వారియుచ్ఛిష్టముం దినుచు వారిమది కెక్కఁ బ్రవర్తింప వారు దయాళురై యతని య భీష్టప్రకార మొకమంత్ర ముపదేశింప నద్దాన నతండు కృతార్థుండయ్యె. మరుపుట్టువున నాతండేసుమా నారదుం డయ్యె. కనుక నెవరితో నున్న వారియాచారవ్యవహారము లే పట్టువడుచుండును.

క. తిలలును నీళ్లును వస్త్రం
బులు పుష్పసుగంధవాసమున సౌరభమం
బొలు పెసఁగఁ దాల్చుఁ గావున
నలయక సత్సంగమమున నగు సద్గుణముల్.

నువ్వులు - నీళ్ళు - వస్త్రములు, పువ్వులతోఁ జేరి పరిమళ వంతము లగునట్లు జనులు సజ్జనులతోఁ గలసి సుగుణవంతు లగుదురు.

ప్రహ్లాదుఁడు

లోకకంటకుఁ డగుహిరణ్యకశిపుఁడు తపముచేయ నడనెఱింగి యింద్రుఁ డెత్తివచ్చి యతనిపట్టణమును గొల్లగొట్టి గర్భిణి యగునాతనిభార్య లీలావతిం జెఱవట్టి కొంపోవుచుండె. ఇది నారదుం డెఱింగి యింద్రుని వారించి యామెం దనకడ నుంచి కొనియె. ఆలీలావతియు శుచియై యమ్మహాముని శుశ్రూష సేయుచుండె. ఆఋషి యనేకభక్తులచరిత్రలు భగవన్మహిమలు నామెకు విన్పించుచుండె. అదృష్టవంతుఁ డగునాగర్భస్థ

బాలుండును వానిని విని భగవద్భక్తుండై ప్రహ్లాదుఁడు వాఁబా రఁగి ప్రసిద్ధింజెందె.

నారదమహాముని సన్నిధానభాగ్యమే లీలావతి కప్పుడు లభిం పనిచో నాశిశు వట్టివాఁడై యుండునోకదా ?

బిడ్డా! సత్సహవాసము చేయు మనుటవలననే దుస్సహవాసము కూడ దనిచెప్పిన ట్లైనది.

దుర్జనుఁ డకారణవిరోధి. తనకు లాభము లేకున్నను నన్యుల కపకారము చేయుటయం దప్రమత్తుఁడై యుండును.

క. తల నుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విసముగదరా సుమతీ !

పామునకుఁ గోఱలయందును దేలునకుఁ గొండియందును దుర్మార్గునికి నిలువెల్లను విషముండును.

వానినోరు మాటాడుచున్న నొసలు వెక్కిరించుచుండును. చెప్పు మాటలు తియ్యగనున్నను జేయుపనులు చేదుగా నుండును. కుడికన్ను కుదురవేయుచు నెడమకన్ను నెగురవేయు చుండును. పయోముఖవిషకుంభములవంటి వీరిం జేరఁబోవకుము. దుర్జనుని జూచి తొలఁగిపోవలయు ననుమాటను నిరంతరము జ్ఞప్తియం దుంచుకొనుము.

గీ. కారణము లేనికలహంబు, కరుణలేమి,
పరవధూపరధనవాంఛ, బంధుసాధు

జనములం దసహిష్ణుత్వ మునఁగ జగతిఁ
బ్రకృతిసిద్ధంబు లివి దుష్టనికరమునకు.

నిష్కారణముగాఁ గలహించును. బీదసాదలపై నించుకంతయుఁ గరుణ లేకుండును. పరస్త్రీలను గామించును. పరధనముల నాసించును. బంధుగులను మంచివారిని జూచి ఈర్ష్య లేకుం డును. ఇవి దుర్జనులకు స్వభావగుణములు. కనుక వాఁడు చుట్టమైనను వదలిపెట్టఁ దగినవాఁడే. విభీషణుఁడు దుర్మార్గుఁ డగురావణుని నన్నయనియేని తలంపక వదలిపెట్టి రాముని జేర లేదా? సుఖముల నంద లేదా? ధృతరాష్ట్రుఁడు క్రూరుఁ డైనదుర్యోధనుని బుత్రప్రేమచే వీడ లేక పో లేదా? తనసంత తిని నీఱుచేసికో లేదా?

ఖలునితో స్నేహముచేయక మాటలాడినమాత్రమున నేమి కీడు మూడు ననితలంపకుము. ఒకసారి సంభాషించినం జాలు నెఱకై మోసపోవు చేఁపచందంబున లోఁబడిపోయెదవు. పిదప వదలించుకొనుట దుష్కరము.

ఘోరీ

జయచంద్రుఁడు, పృథ్వీరాజు కలహించుకొనిరి. జయ చంద్రుఁడు జయింపలేక దుష్టుఁ డగుమహమ్మద్ ఘోరీ నాశ్ర యించె. పిదప నిర్వురు కలిసి పృథ్వీరాజును జంపిరి. జయచం ద్రునిగతి యేమయ్యెనో వింటివా? ఆదుర్మార్గుఁ డగు మహ మ్మద్ ఘోరీ తనమిత్రు మనియేని తలంపక నిస్సహాయుఁ

డగు జయచంద్రునిం జంపి రాజ్య మాక్రమించుకొనెను. కట్టా! కూళ యగుజయచంద్రుఁ డల్లునిం జంపించి కూఁతును విధవం జేసె. తుదకుఁ దాను నిహతుండయ్యె. అన్య దేశీయు నితోఁ జెల్మిసలిపి యాత్మదేశమునే యధోగతిపాలుచేసె. దుస్సాంగత్యఫలము తనకేగాక, తమవారికేగాక, తమదేశ మునకును లభించును.

మఱొకమాట. సుజనదుర్జనులు మైత్రిచేసికొనిన నెవరిగుణము లెవరికి వచ్చును ?

వినుము. ఇందొకరహస్య మున్నది. మొద లామైత్రి కలి యనే కలియదు. ఒకవేళ నేల్లొ ప్రమాదంబున స్వల్పకాలము కలిసె ననుకొన్నను, లేక దుష్టుని సన్మార్గమునకుఁ ద్రిప్పుటకై సజ్జనుఁడే యట్లు నటించె నన్నను, మఱి యెట్లు కలిసినను - ఎవ్వనియందు సుగుణములుకాని దుర్గుణములుకాని నాటుకొని పోయి పెంపొంది యభేద్యములగునో వానిగుణములు సాధా రణముగా మారవు. కాని యవి యంకురములే యగుచో మాత్రము క్రమముగా మారవచ్చును. సుగుణదుర్గుణముల పరస్పరసంఘర్షణమువలన దుర్బలములు పరాజితములు, సుబ లములు జైత్రములు నగుట సహజముగదా. అందును దుష్టము లగుగుణములకు సహజముగనే భీతియుంటచే నవి సులభముగాఁ బరాజితము లగుననవచ్చును. కాని యవి యవి

వేశము నూఁతగొని యుండు నెడల నట్లు సులభముగాఁ ద్రోసి
వేయఁబడవు. సమానబలము లగుసుగుణదుర్గుణములకు మైత్రి
సంభవింపదు. సంభవించినను నది స్వల్పకాలముననే చెడి
పోవును. అధికన్యూనబలగుణములకే యది ఘటిల్లును.

కాన నెవ్వఁడు మఱొకని స్నేహముం గోరి యతనిచుట్టుఁ దిరు
గుచు మనఃపూర్వకముగ యాచించునో యయ్యాశ్రితుని
గుణములే చలించి మాఱిపోవు నని మెఱుంగునది. ఒకఁడు
చెడుత్రోవం బ్రవేశించుచుండ మఱొక స్థిరచిత్తుఁ డతని వెంటఁ
బోయి యాతని సన్మార్గమునకును ద్రిప్పవచ్చును. స్థిరచిత్తు
నెవ్వఁడు నెట్లు గదలింప నేరఁడు.

యవనహరిదాసు వంగదేశమున "బెనాఫోలె" వనమున హరి
స్మరణము సలుపు చుండెడివాఁడు. వానిభక్తిని జెఱుపంద
లంచి రామచంద్రఖానుఁ డొకచక్కని వేశ్య నాతనికడ కం
పెను. అదియుంబోయి కనులుమూసికొని హరినామస్మరణము
సేయునాహరిదాసుచెంత రేయి యంతయుం గనిపెట్టుకొని
యుండి యతఁడు కనులు దెఱవమికే వెఱఁగుపడి యింటికివచ్చు
చుండెడిది. ఆయన నామస్మరణము సూర్యోదయమునకుఁగాని
పూర్తి కాదు. ఎన్నిదినములో యిట్లు జరిగెను. తుద కావేశ్య
యతనినిశ్చలభక్తికి నివ్వెఱపడుటయే కాక తనహృదయమును
గూడ మార్చుకొని యాయన పాదములపైఁబడి "స్వామీ!
నాయపరాధముల క్షమింపుఁడు. తెలివిమాలినదాననై మీ

కొండుచేయఁ దలంచితి "నని యేడ్చుచు వేఁడికొని నాటినుండి యది సన్మార్గమున నడవందొడంగె. నిశ్చలచిత్తుల నెవరు గదల్పఁగలరు?

ఎవ్వఁ డెవ్వనివలన సన్మార్గమున నడచునో వానికి వానితో నైనది సత్సాంగత్యము. ఎవ్వఁ డెవ్వనివలన దుర్మార్గమున నడచునో వానికి వానితో నైనది దుస్సాంగత్యము. నీవు మంచి వారి ననుసరించిన వారిగుణములే పట్టువడును. అట్లు సన్మార్గమునఁజరించుట కారంభించిన నీయం దాసద్గుణములు పాదుకొని పోలేదుకనుక నట్టి ప్రారంభదశయందు దుష్టుల నీదగ్గఱకుం జేరనీకుము. చేరనిచ్చినచో నానూతన సద్గుణబీజములు చలించి నీయందు మొలకెత్తనేరవు. అవి మొలకెత్తి పెరిగినపిమ్మట నచంచలము లగునుగాన నప్పుడు దుష్టులు నిన్నుఁ జేరినను నీ కెగ్గులేదు. మీఁదుమిక్కిలి వారినే నీవుచేరి సన్మార్గమునకుం ద్రిప్పఁ గడఁగవచ్చును. అట్లు చేయుటయు ధర్మము.

శ్లో. రవిశ్చ రశ్మిజాలేన దివా హంతి బహిస్తమః
సంత స్సూక్తిమరీచ్యౌఘై శ్చాంతర్ధ్వాంతం హి సర్వదా.

సూర్యుఁడు తనకిరణసమూహముచేత బయటిచీకటిని బగలు మాత్రము వినాశనముచేయును. సజ్జనులు మంచిమాట లను కిరణసమూహములచేఁ బగలేకాక యెల్లప్పుడు (లోపలి యంధకారమును) హృదయాంధకారమునుగూడఁ బోఁగొట్టఁగలరు. కనుక సత్సాంగత్య మెల్లర కత్యవసరము.

సంపూర్ణము

# నీతిపద్యములు

——(౦)——

(విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పుచున్నాఁడు)

క. బలవంతుఁడు పై నెత్తిన
బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, ముచ్చిల వేచువాఁడు, కామా
కులచిత్తుఁడు, నిద్ర లేక కుందుదు రధిపా! 1

అర్థ. ఎత్తినన్ = దండెత్తినచో, ముచ్చిలన్=దొంగిలుటకు, వేచువాఁడు = ఎదురుచూచువాఁడు.

క. జనులకు నొడఁబా టగువిధ
మున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, మీ
ఱినయొకనికలిమి కులుకక
మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 2

అర్థ. ఒడఁబాటు = సమ్మతి. ఉడుగుచు = మానుచు; మనుట = బ్రదుకుట.

క. కోపము నుబ్బును గర్వము
నాపోవనియునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి
కాపురుషగుణంబులందు్రి కౌరవనాథా! 3

అర్థ. ఉబ్బుట = పొంగుట. ఆపోవనియునికి = తృప్తిపడకయుండుట. నిర్వ్యాపారత్వము = పనియేమియుఁ జేయకుండుట - సోమరితనము. కాపురుషులు = కుత్సితపురుషులు - చెడ్డవారు.

క. ఏలినవానిని, దైవము,
నాలిని, బంధులను, సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁ డాఫలము లాసపడు మనుజేంద్రా! 4

అర్థ. పాలసుఁడు = దుర్జనుఁడు. సమ్ + ఉచిత + ఆరాధనసంశీలతన్ = తగినట్లారాధించుస్వభావమువలన. అనఁగా 'ఎవరి నెట్లుగౌరవింపవలయునో యెవరి నెట్లుచూడవలయునో యట్లు సలుపకున్న నందువలన వచ్చునాయాఫలితముల నాసించుననుట-కనుక నే వాఁడు దుష్టుఁడు.

క. నెమ్మి గలవారి నొల్లరు,
త మ్మొల్లనివారి వెనుకఁ దగులుదు. రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు,
రి మ్మెఱుఁగనియట్టివార లిభపురనాధా! 5

అర్థ. ఇమ్ము = ఉపాయము, యుక్తము. నెమ్మి = స్నేహము. తొడరుదురు = ఎదిరింతురు. ఇభపురనాథా = హస్తిపురమునకుఁబ్రభువైనవాఁడా! ధృతరాష్ట్రుఁడా!

క. ధనమును, విద్యయు, వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును. స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా! 6

క. అరిదివిలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచుఁ, దప్పి చనినం జను, నే

ర్వరి యైనవానినీతి

స్ఫురణము పగరాజు నతనిభూమిని జెఱుచున్. 7

అర్థ. అరిదివిలుకాని=గొప్పవిలుకానియొక్క; శిఖిజ్వాలశరము=నిగనిగలాడుబాణము.

క. విను మధురాహారంబులు

గొనుటయుఁ, బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే

ల్కనియునికియుఁ, గార్యాలో

చనముఁ, దెరువు నడచుటయును, జన దొక్కనికిన్. 8

అర్థ. మధుర + ఆహారంబులు = తియ్యని (పిండివంటలు మొదలైన) పదార్థములు.

క. క్షమియించువారిఁ గని చా

లమి పెట్టుదు, రైననుం దలంప ననూన

క్షమయ కడు మేలుతోడ; వు

త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్. 9

అర్థ. చాలమి పెట్టుదురు = శక్తిలోపమునారోపింతురు. (అశక్తుఁడందురు.) తోడవు=సొమ్ము. దానిన్=ఆయోర్పును. అనూన=తక్కువకాని అనఁగా నెక్కుడైన. క్షమయ=ఓర్పే.

క. పురుషుండు రెండుతెఱఁగుల

ధర నుత్తముఁ డనఁగఁ బరగుఁ, దా నెయ్యెడలన్

బరుసములు వలుకకునికిన్,

దురితంబులు వొరయుపనులు దొఱఁగుటవలనన్. 10

అర్థ. పరుసములు=కఠినవాక్యములు, పలుకక - ఉనికిన్=ఉండుట చేతను, దురితంబులు=పాపములు, పొరయుపనులు = కలుగునట్టి పనులు, తొలఁగుట=మానుట.

గీ. చెల్లియుండియు సైరణసేయునతఁడుఁ,
పేదపడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు కురువరేణ్య ! 11

అర్థ. చెల్లియుండియున్ = శక్తిగలిగియుండియును, అనఁగాఁ దన యాజ్ఞ కడ్డులేకుండినను. సైరణచేయు + అతఁడు (అపకారులను) క్షమించువాఁడు. అర్థి = యాచకుఁడు.

గీ. పాడి దప్పకుండఁ బడయుసొమ్ములకు న
పాత్రములకు నీగి, పాత్రములకుఁ
బెట్టకునికి, యనఁగ నెట్టన రెండు వి
ధములఁ గీడు వొడరు ధరణినాథ ! 12

అర్థ. పాడి = ధర్మము - న్యాయము. అపాత్రములకున్=అనర్హులకు తగనివారికి. ఈగి = ఇచ్చుట, దానము, పాత్రములకున్ = తగినవారికి. పెట్టక + ఉనికి = ఒసఁగకుండుట. నెట్టన = మిక్కిలి.

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ, బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల. 13

అర్థ. వెలఁది = స్త్రీ. పానంబు=కల్లుమొదలైనవి త్రాగుట. పలుకు ప్రల్లదంబు = కఠినముగా మాట్లాడుట. దండంబుఁబరుసఁదనము = కఠిన దండనము. నిష్ప్రయోజనముగన్ = ఉపయోగములేకుండ. వమ్ము - చేఁత = నాశముచేయుట - వ్యర్థముచేయుట. తగులన్, చనదు = అంటుకొనరాదు.

గీ. తగినవేషంబు, దనుఁదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యెచ్చి వగవ
కునికి, తన కెంతనడవకయున్నఁ బథము
దప్పకుండుట, నడవడి కొప్పుసేయు. 14

అర్థ. నొచ్చి యున్ = నొప్పిఁజెందియునుగూడ, బాధపడియుఁగూడ. వగవక + ఉనికి = ఏడువకుండుట. పథము = త్రోవ, సన్మార్గము.

క. చెలిమియు, సంభాషణమును,
బలిమివివాదంబుఁ, దోడ్పుఁబాడియుఁ, దమయం
తలవారితోన తగు, నధి
కుల హీనులతోడనైనఁ గొఱగా దధిపా ! 15

అర్థ. బలిమివివాదంబు = ప్రబలమైన వాక్కలహము — తగవు. కొఱగాదు = పనికిరాదు.

గీ. కొంచెమైనను దగఁ బంచికుడుపు మేలు;
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము; శత్రువునకునైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ; నృపాల ! 16

అర్థ. కొంచెము + ఐనను = (తనదగ్గరఁ దినఁదగుపదార్థము) కొంచెముగానున్నను. తగన్ = ఒప్పునట్లు (ఉన్నదానిలోకొంచెము) పంచి = (ఎదుటివానికిఁ) పెట్టి. కుడుపు = (మిగిలినది తాను) తినుట.

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు, వెండియుఁ గడుమే
లొనరించుఁ, గీడొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుగుచువచ్చున్. 17

గీ. తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి
చేటు కాదు, విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మించుఁ, జెడదు బీ
జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 18

అర్థ. తనియన్=పూర్తిగాఁ బండకమునుపే కాయను గోసికొనిన చో, చవిచేటు+ఎ కాదు,=రుచిచెడుటమాత్రమే కాదు. విత్తుచేటు=విత్తనముచెడుట. పక్వము+అగుడున్ = పండినపిదప, ఫలము, ఇంచున్= రుచించును. బీజంబుచెడదు.

గీ. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ, దేఁటి
పువ్వుఁదేనియఁ గొనియెడుపోల్కి, నెవరు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము,
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁజనదు. 19

అర్థ. మాలకరి = పూలదండలుకట్టువాఁడు. పువ్వుఁదేనియన్= మకరందమును.

క. పరులధనమునకు, విద్యా
పరిణతికిన్, దేజమునకు, బలమునకు, మనం
బెరియఁగ నసహ్యపడున
న్నరుఁడు తెవులులేని వేదనం బడు నధిపా! 20

అర్థ. విద్యాపరిణతి = విద్యాపరిపాకము - సంపూర్ణవిద్య యనుట. ఎరియన్-కన్ = మండగా, పరితపింపగా, తెవులులేని వేదనన్ = రోగము లేని బాధను.

క. ఎదిరికి హితమును బ్రియమును
మది కింపునుగాఁగఁ బలుకుమాటలు పెక్కు-
రొదవినను లెస్స, యటుగా
కిదియది యన కూరకునికి యెంతయు నొప్పున్. 21

అర్థ. ఊరక + ఉనికి = మాటలాడకుండుట, మౌనమువహించుట.

క. చెలిమియుఁ బగయును, దెలివియుఁ,
గలఁకయు, ధర్మంబుఁ, బాపగతియును, బెంపుం,
దులువతనంబును వచ్చును
బలుకుబడిన; గానఁ బోసఁగఁ బలుకఁగవలయున్. 22

అర్థ. కలఁక = మనస్సంక్షోభము, కలఁత. పెంపు = అభివృద్ధి. పలుకుబడి = మాట. తగినట్లుమాట్లాడినఁ, దగినట్లు మాట్లాడకున్న వచ్చు. మేలుకీళ్ళందుఁజెప్పఁబడిరి.

క. బెడిదముగఁ గత్తి గ్రొడ్డటఁ
బొడువఁ దెగినమ్రానిఁ జిగురు పొడముఁ బలుకులం
జెడఁదునిసినకార్యంబు ని
గుడ నేరదు పిదప నెట్టుఁ గురువంశనిధీ ! 23

అర్థ. బెడిదముగన్ = భయంకరముగా, చిగురు, పొడుమన్ = చిగురాకుపుట్టును. పిదపన్—ఎట్టిన్ = ఎట్లైనను. నిగుడ నేరదు = చక్కఁబడఁజాలదు.

క. తనువున విఱిగినయమ్ముల
నసువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురత౯
మనమున నాటినమాటలు
విను మెన్నియుపాయములను వెడలునె ? యధిపా ! 24

అర్థ. అమ్ము = బాణము. అసువున౯ = ఉపాయముచే. అతినిష్ఠురత౯ = మిక్కిలి కాఠిన్యముతో

గీ. సకలపుణ్యకర్మచయమును నొకదెస,
వినుము పాడిదప్పకునికి యొక్క
వలను, దీని శ్రుతులు దెలిపెడునెడఁ బాడి
కలిమియంద పెద్ద గానిపించె. 25

అర్థ. సకల = సమస్తమైన (అన్ని) పుణ్యకర్మ = పుణ్యమువచ్చు పనులయొక్క. చయము = సమూహము. పాడి = ధర్మము. ఒక్కవలను = ఒక్కదిక్కు. శ్రుతులు = వేదములు.

గీ. పాడి గలిగిన నిహలోకఫలము లెల్లఁ
జేరుటయ కాదు, కీర్తియుఁ జెందుఁ బురుషు ;
ధరణిఁ బొగడిత యొందాఁకఁ బరఁగు నంత
కాలమును బుణ్యలోకంబు గలుగునండ్రు. 26

అర్థ. పాడి = న్యాయము, ధర్మము. ఇహలోకముఫలము = ఈ లోకమునందలిఫలము. పొగడిక = కీర్తి.

గీ. చేటుకాలమైనఁ జెట్టమాటలు, నెఱి
గాని తెరువు వట్టుకర్జములును,
దగవు లట్లతోఁచుఁ; దగియెడునవి యవి
నీతు లని మనంబు నిశ్చయించు. 27

అర్థ. చేటుకాలము = వినాశకాలము. చెట్టమాటలు = చెడ్డమాటలు. నెఱిగాని = న్యాయముగానియట్టి, తెరువు = మార్గమును, పట్టు = పట్టిన - అవలంబించిన, కర్జములును = కార్యములును. తగవులు + అట్లు=ధర్మములు గానే. తగియెడు + అవి=తగినట్టికార్యములు - మంచికార్యములు. అవి నీతులు = నీతిలేనివి - అనఁగా నధర్మములు.

గోవ్యాఘ్రిసంవాదము

తన్ను జంపుటకు వచ్చినపులితో నావిట్లనియె.అయ్యా! నమస్కారము. ఇంచుక నామనవి వినుము.

చ. మునుమునఁబుట్టె నాకునొకముద్దులపట్టి,యతండుపుట్టి యే
డెనిమిదినాళ్ళపాటిగలఁ,డింతియు పూరియు మేయనేరఁ,డేఁ
జని కడుపారఁ జన్గుడిపి చయ్యన వచ్చెద, నన్నుఁబోయిర
మ్మని సుకృతంబుగట్టికొనవన్న! దయాగుణ ముల్లసిల్లఁగన్.

అర్థ. పూరియున్ = లేఁతగతిక పోచలనుగూడ. మేయన్ = తిను టకు-నమలుటకు. నేరఁడు = శక్తిగలవాఁడుకాఁడు. ఏన్ = నేను. చని = వెళ్ళి. చన్గుడిపి = పాలిచ్చి. చయ్యనన్ = తొందరగా.

గీ. అతిథిసత్కారముకంటె నధికమైన
ఫలము లేదండ్రు పెద్ద; లీపట్టునందు
నీవ యతిథివి నాకు, ని న్నిచట డించి
పోయి రాకున్నఁ బాపంబు పొరయకున్నె ? 29

అర్థ. అతిథిసత్కారము = అతిథియొక్కసమ్మానము. అతిథియనఁగా భోజనార్థ మింటికి వచ్చినవాఁడు.

గీ. ఆడి తిరిగినఁ జండాలుఁ డండ్రు గాని
కులము చండాలుఁడైనను గొఱఁత లేదు.
బొంకకున్నఁ జండాలుఁడైపో ధరిత్రిఁ
బూజ్యుఁ డనుమాట వినవయ్య పులులరాజ ! 30

అర్థ. పూజ్యుఁడు = పూజింపఁదగినవాఁడు.

ఉ. ప్రిల్లదమాడి పెద్దలకు బాధయొనర్చునతండు, తండ్రికిన్
దల్లికి మాఱుపల్కెడినతండును, నాఁకొనవచ్చి యొడ్ల చే
నుల్లమెలర్ప మేయఁజనుచున్న వృషంబు నదల్చువాతఁడున్
దెళ్ళెడునట్టిదుర్గతులఁ దెళ్ళుదు నే నిట రాకతక్కినన్.

అర్థ. ప్రిల్లదము + ఆడి = చెడ్డమాటపలికి. ఆఁకొని = ఆఁకలిగొని. ఒడ్లచేన్ = పరులచేను. ఉల్లము + ఎలర్పన్ = మనస్సు సంతసింపఁగా.

సీ. అపరాహ్ణవేళయం దతిథి యాఁకొనివచ్చి
యడిగినఁ బెట్టక గడపువాని
గతికి, నర్థాపేక్షఁ గన్నియఁ గొనిపోయి
ముసలికి నిచ్చుతామసునిగతికిఁ

పాపంబులేక యే పత్నిఁ బరిత్యజిం
చినవానిగతికి, నాశ్రితచయంబు
గ్రాసంబు లేక దుఃఖముల నొందఁగ నస
ద్వ్యయ మాచరించిన వానిగతికి,
ధారవోసినధన మీఁక తత్ప్రతిగ్ర
హీతఁ బలుమాఱు నడిగించుదాతగతికిఁ,
బోవుదాన, నింటికిని నేఁ బోయి మరలి
రాక తక్కితినేఁ బుండరీకవర్య ! 32

అర్థ. అర్థ + అపేక్షన్ = ధనమునందలియాశచేత. కాపురుషుఁడు = దుష్టుఁడు. పత్నిన్ = భార్యను. ఆశ్రితచయంబు = ఆశ్రయించుకొనియున్నవారిగుంపు. గ్రాసము = ఆహారము. అసద్వ్యయము=దుర్వ్యయము. తత్-ప్రతిగ్రహీతన్=ఆధనముదానముపట్టినవానిని. పుండరీకము=పులి.

వ. అని పులి నోడంబఱిచి యింటికిం జని తన బిడ్డకు గోవు నీతులు గఱపుచున్నది.

క. ఆడకు మసత్యభాషలు
కూడకు కొఱగానివానిఁ, గొంకక యొరు లె
గ్గాడిన నెదురుత్తర మీఁ
జూడకు, విని విననివానిచొప్పునఁ జనుమీ. 33

అర్థ. ఎగ్గు + ఆడినన్ = కీడుపల్కినచో-తిట్టినచో. ఎదురు + ఉత్తరము=తిరుగుజవాబు, ఈన్ + చూడకు=ఇచ్చుటకుఁ బ్రయత్నింపకుము.

క. ఒంటిఁ జరింపకు పొలమున,
నింటికిఁ గడుఁ బొద్దుగలుగ నేతెంచుచు రా,

వెంటఁబడి పొడుచుగోవుల
చెంటఁ జనకుఁ గ్రయ్యఁబడకు సందడియగుచోట. 34

అర్థ. ఏతెంచుచుండా = వచ్చుచునుండుము. సందడి = సమ్మర్దము (జనులరొత్తిడి) పసులరొత్తిడి, అగుచోట. క్రయ్యన్ + పడకు=చేరఁబోకుము. ఆసమ్మర్దములోనికిఁ జొరఁబడకుము.

క. తోడుకుఁ దినఁబోవుపసరము
బడిఁ బోకుము; తురగగార్దభద్విరదాదుల్
నడచుపథంబున కడ్డము
నుడియకు; దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ. 35

అర్థ. తోడుకు = దొంగమేఁత. పసరముబడిన్ = పశువువెంబడి. తురగ=గుఱ్ఱములు, గార్దభ=గాడిదలు, ద్విరద=ఏనుఁగులు, ఆదుల్ = మొదలైనవి. పథము=త్రోవ.

క. నూతులదరులను, లోఁతగు
పాఁతటికసవులను, నెట్టిపచ్చిక యున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము;
మూతి యిడకు ముగ్రసత్వములు గలనీటన్. 36

అర్థ. దరి=ఒడ్డు. పాఁతటికసవు=పాఁతళ్లలో మొలచుగడ్డి. ప్రాఁతిపడి= ప్రీతికలిగి, ఉగ్రసత్వములు=భయంకరమైన జంతువులు, మొసళులు మొదలైనవి.

క. ఏను గలిగియుండఁగ, నె
వ్వానికి నిను ముద్దుసేయ వాలాయ మగున్

గాని యిటమీఁద నెవ్వఁడుఁ
గానికిఁ గైకొనక చుల్కఁగాఁ జూచుఁ జుమీ. 37

అర్థ. ఏను=నేను. వాలాయము=అనివార్యము (తప్పనిసరి). కాని
కిఁ + కైకొనక=కానిడబ్బునకును దీసికొనక = అనఁగాఁగొంచెమైనగౌర
వింపక.

క. చులుకన జలరుహతంతువు,
చులుకన తృణకణము, దూది చుల్కనసుమ్మీ,
యిల నెగయుధూళి చులుకన
చులుకన మఱి తల్లిలేనిసుతుఁడు కుమారా! 38

అర్థ. జలరుహతంతువు = తామరకాడలోనిసన్ననిదారము. తృణ
కణము=గడ్డిపరక. ధూళి=దుమ్ము.

క. పుట్టినపిమ్మటఁ జావును
గట్టి, వృథామరణ మొందుకంటె బుధులకుఁ
దట్ట మగుకీర్తిసుకృతము
లిట్టలముగఁ గల్గుచావు లింపులుగావే. 39

అర్థ. సుకృతము=పుణ్యము. ఇట్టలముగఁ=అధికముగా.

వ. అని కొడుకును బుజ్జగించి సమ్మతివడసి వడివడిగాఁ బులి
చెంతకుఁ బర్విడివచ్చి యాగోరత్న మిట్లనియె. అయ్యా!
ఇంతప్రొద్దుదాఁకఁ గడునాఁకొని యేక్రియ నుంటివోకదా!

సీ. ఇంతతాల్మి లేక యిల నిట్టిసుకృతంబు
లెట్లు సంభవించు నేరికైన,

నీ నిమిత్తమైకదా నాతనూజుని
బుజ్జగింపఁగంటిఁ బురికి నేగి. 41

అర్థ. తాల్మి=సహనము-ఓర్పు.

క. నామన సొక్కటి యయ్యెను ;
నీమనసారఁగ భుజింపు, నీ కే నధిక
ప్రేమమున సమర్పించితి
నామే, నిదె పుణ్యగతికి ననుఁ బుచ్చ వనా ! 42

అర్థ. నామనసు=నాకోరిక. నామేను=నాశరీరము. పుచ్చవనా=పంపవయ్యా.

గీ. అనిన దానితెగువ కద్భుతస్వాంతుఁడై
పుండరీక మేను బుట్టి పెరిగి
యింతవాఁడ నైతి, నింతనిష్కపటుల
నిట్టిధీరమతుల నెఱుఁగ నెందు. 43

అర్థ. తెగువ=సాహసము. అద్భుతస్వాంతుఁడు = వింతపడినమనస్సు గలవాఁడు. నిష్కపటులన్=కపటములేనివారిని.

మ. అని యాధేనువుఁ జూచి నీవిమలస
త్యప్రౌఢికిన్ మెచ్చువ
చ్చె, నినుం జంపఁగఁజాల; నీదుతలఁ గా
చెన్ ధర్మ మీపొద్దు; పో
మ్ము నిజావాసము చేర నీసఖులు స
మ్మోదంబునుంబొంద, నీ
తనయుం డత్యనురాగముంబొరయఁ జి
త్త ప్రీతి మైనొందఁగన్. 44

అర్థ. నిజ + ఆవాసము = సొంతయిల్లు. సఖులు = స్నేహితులు ప్రమోదము = సంతోషము.

సీ. కుడువంగ రమ్మని తోడరి చుట్టముఁ బిల్వ
నాఁకలి కా దొల్లననుచుఁ బెనఁగు
నతఁడునుబోలె, నాతతశోభనాంగియై
తనరునాధేనురత్నంబు దన్ను
భక్షింపుమని పట్టుపఱుప, సద్యోజ్ఞాన
శాలియై పరఁగుశార్దూలవిభుఁడు
దా నొల్లనని పల్కఁ, దమలోన నొకకొంత
తడవు ముహుర్భాషితంబు లిట్లు
జరుగుచుండ గోవుసత్యవాక్శుద్ధికిఁ
బులికృపాసమగ్రబుద్ధికిని బ్రి
సన్ను లైరి సురలు, సాధువాదము లుల్ల
సిల్లె గగనవీధి నెల్లయెడల. 45

అర్థ. కుడువన్ + కన్ = భుజించుటకు. ఆతతశోభన + అంగియై = విస్తారమైన శుభమైనయాకారముగలదియై. సద్యః + జ్ఞానశాలి = అప్పటికప్పుడుపుట్టినజ్ఞానముకలది. ముహుః + భాషితంబులు = మాటిమాటికి మాటలు.

క. పసరం బండ్రు వివేకము
పస చాలనినీచు, నట్టిపసరము కాదే
వసుధపయి సత్యవాక్యం
బసదృశముగ నిర్వహించె నతిమోదముతోన్. 46

అర్థ. వివేకముపస = తెలివితేట. అసదృశముగన్ = సాటిలేకుండఁగా.

---